# ఆంధ్ర గుహాలయాలు

## Cave Temples of Andhra


రచయిత

దేవిరెడ్డి సుబ్రమణ్యాం రెడ్డి, ఎం ఏ., ఎం. ఫిల్.

లెక్చరర్, చరిత్ర శాఖ, జవహర్ భారతి,

కావలి, నెల్లూరు జిల్లా, ఏ. పి.

Dr. DEVIREDDY SUBRAMANYAM REDDY
M.A., M.Phil., Ph.D.
Associate Professor
Department of History
Sri Venkateswara University
TIRUPATI - 517 502 (A.P.) INDIA


ముందు మాట

డా॥ కె. కృష్ణమూర్తి, ఎం. ఏ; పి. హెచ్. డి; డి. లిట్; ఎఫ్. ఆర్. ఏ. యస్. (లండన్); ఎం. ఆర్. ఏ. ఏ. (లండన్)

సూపరింటెండింగ్ ఆర్కియాలజిస్టు

ఆర్కియలాజికల్ సర్వే ఆఫ్ ఇండియా

టెంపుల్ సర్వే ప్రాజెక్ట్, దక్షిణ ప్రాంతము

ఫోర్ట్ సెయింట్ జార్జ్, మద్రాసు.


క్లియో బుక్ క్లబ్

కావలి.

1988

# అంకితము

*గురువర్యులు, శ్రేయోభిలాషి*

**ప్రొఫెసర్ వి. కామేశ్వరరావు,** ఎం. ఏ; పిహెచ్. డి; గారికి

చరిత్రశాఖ, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి.

# విషయసూచిక
## Contents

# ముందు మాట

## Foreword

కావలి జవహర్ భారతి కళాశాల అధ్యాపకులు శ్రీ దేవిరెడ్డి సుబ్రమణ్యంరెడ్డిగారు రచించిన "ఆంధ్ర గుహాలయాలు" అనెడి గ్రంథానికి ముందుమాట వ్రాస్తున్నందుకు నాకు చాలా సంతోషంగా ఉన్నది. శ్రీ రెడ్డిగారు రచించిన ఈ గ్రంథం ప్రాముఖ్యాన్ని సంతరించుకొనియున్నది. ఇది ఆంధ్రలోని గుహాలయాల వాస్తుశిల్పాలను లోతుగా పరిశీలన చేసి రచించిన విశిష్ట గ్రంథము. అంతేగాక ఆంధ్ర గుహాలయాలపై వివరణాత్మకంగా, విమర్శనాత్మకంగా రచింపబడిన తొలి గ్రంథము. ఇందు ఆంధ్ర గుహాలయాలు, వాటిలోని శిల్పాలను ఇతర ప్రాంతాల వాస్తుశిల్పాలతో పోల్చి సామ్యాలు, భేదాలు వివరింపబడియున్నవి. ఈ శిల్పాలు ఏ శిల్పశాస్త్రాల నియమాలకు అనుగుణంగా ఉన్నవో కూడా తెలుపబడియున్నది. ఈ వివరాల వలన ఆయా ప్రాంతాల గుహాలయాల నిర్మాణ కాలాలు, నిర్మాతలగూర్చి కూడా వాస్తుశిల్పాల రీత్యా తెలుసుకొనుటకు వీలగుచున్నది. అంతేగాక ఇది భారతదేశమందలి, ముఖ్యంగా దక్షిణ భారతదేశ గుహాలయాలనుకూడా క్లుప్తముగా ప్రస్తావించి దేశమందలి గుహాలయాల వాస్తుశిల్పాల మనోదర్శనాన్ని కల్పించుచున్నది. ఇట్టి పరిశోధనా విధానాలు రచనలో అనుసరించబడి యున్నందున ఈ గ్రంథము ఒక ఉత్తమమైనదిగా చెప్పవచ్చును. పరిశోధకులకు, సామాన్యులకు కూడా చక్కగా అర్థమయ్యే రీతిలో, సులభశైలిలో రూపొందిన ఈ గ్రంథము వాస్తుశిల్పశాస్త్ర ప్రాచుర్యానికి ఎంతో దోహదము చేయునని నా నమ్మకము. ఇందలి అనేక చిత్రపటాలు గ్రంథముయొక్క శోభను, వివరాల గ్రహింపును కల్గించుచున్నది.

కె. కృష్ణమూర్తి

సూపరింటెండింగ్ ఆర్కియాలజిస్ట్
ఆర్కియలాజికల్ సర్వే ఆఫ్ ఇండియా
టెంపుల్ సర్వే ప్రాజెక్ట్
దక్షిణ ప్రాంతము
ఫోర్ట్ సెయింట్ జార్జ్
మద్రాసు - 600 009.

# కృతజ్ఞతలు

ఈ గ్రంథ రచనలో ప్రోత్సాహ, సహాయాలందించిన అనేకమందికి నా కృతజ్ఞతలు. ముఖ్యంగా నా గురువర్యులు, శ్రేయోభిలాషులైన శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం చరిత్ర శాఖలోని ప్రొఫెసర్ వి. కామేశ్వరరావుగారికి, ప్రొఫెసర్ పి. రఘునాధరావుగారికి (చరిత్ర శాఖాధిపతి), ప్రొఫెసర్ యస్. గోపాలకృష్ణన్‌గారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

ఎల్లప్పుడూ నా అభివృద్ధి శ్రేయస్సులను ఆకాంక్షించేటటువంటి మా కళాశాల పూర్వ ప్రిన్సిపాల్ డాక్టర్ యం. పట్టాభిరామరెడ్డి, డాక్టర్ వై. గోపాలరెడ్డి (ప్రభుత్వ కళాశాల, ఉలవపాడు, ప్రకాశం జిల్లా) గార్లకు, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలోని జియాగ్రఫీ ప్రొఫెసర్ డాక్టర్ ఎన్. బాలకృష్ణారెడ్డిగారికి, నేటి నా స్థితికి కారకులలో ఒకరైన గూడూరు ప్రభుత్వ కళాశాల కెమిస్ట్రీ లెక్చరర్ శ్రీ కె. వెంకటసుబ్బారెడ్డికి, మా కళాశాలలో అధ్యాపకులకు స్వేచ్ఛను, పరిశోధనా వాతావరణాన్ని కల్పించి, మంచి విద్యను విద్యార్థులకు అందించాలని నిరంతరము తపిస్తున్న నా శ్రేయోభిలాషి, మా కళాశాల రెక్టార్ మరియు కరస్పాండెంటైన శ్రీ దొడ్ల రామచంద్రారెడ్డిగారికి, ఈ గ్రంథానికి ముందుమాట వ్రాసిన, గ్రంథంలోని భైరవకోన ఫోటోలను పంపి సహాయము చేసిన మద్రాసులోని భారతదేశ పురావస్తుశాఖ దేవాలయాల విభాగపు దక్షిణ కేంద్ర అధిపతి డాక్టర్ కె. కృష్ణమూర్తికి, ఆంధ్రప్రదేశ్ పురావస్తుశాఖ అధిపతి డాక్టర్ వి. వి. కృష్ణశాస్త్రికి, గ్రంథ ముద్రణకు అనేక విధాల సహాయపడిన టి. టి. డి. ఓరియంటల్ కాలేజి లైబ్రేరియన్ శ్రీ ఎన్. తులసిరామిరెడ్డికి, ఈ గ్రంథ ముద్రణకు ఆర్థిక సహాయం చేసిన తిరుమల-తిరుపతి దేవస్థానం ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ గారికి, వారి ఎడిటర్ శ్రీ కె. సుబ్బారావు, ఇతర ఎడిటోరియల్ ఆఫీసు సిబ్బందికి, భారత పురావస్తుశాఖ, ఏ. పి. పురావస్తుశాఖకు నా కృతజ్ఞతలు.

అతి తక్కువ కాలంలో ఈ గ్రంథాన్ని సుందరంగా తయారుచేసిన కావలి కోణార్క ప్రింటర్స్ ప్రొప్రయిటర్ శ్రీ జి. వసంతకుమార్, వారి ఉద్యోగ బృందానికి నా కృతజ్ఞతలు.

దేవిరెడ్డి సుబ్రమణ్యం రెడ్డి

చరిత్ర శాఖ
జవహర్ భారతి
కావలి - 524 202
నెల్లూరు జిల్లా, ఏ. పి.

# పరిచయం

## Preface

భారతదేశ గుహాలయాలు, ఆలయాలు మరియు ఆంధ్ర ఆలయాల చారిత్రక, వాస్తు, శిల్ప వివరాలగూర్చి అనేక గ్రంథాలు ప్రచురించబడినాయి. కానీ ఆంధ్రలోని హిందూ గుహాలయాలపై సమగ్రమైన, విమర్శనాత్మక గ్రంథము ఇంతవరకు రచింపబడలేదు. కావుననే ఈ "ఆంధ్ర గుహాలయాలు" గ్రంథ రచన చేపట్టబడినది.

ఇందు ఎనిమిది ప్రధాన విభాగాలు గలవు. మొదటి విభాగము గుహాలయాలపై ఉపోద్ఘాతమును కలిగియున్నది. ఈ భాగముననే కొయ్య, ఇటుక, సున్నము, మట్టి, శిల, శిలాఖండములు ఆలయ నిర్మాణాలకు వస్తువుగా వాడబడిన పరిణామ దశలగూర్చి చర్చించబడియున్నది. అంతేగాక బౌద్ధ గుహాలయాలు హైందవ గుహాలయాల నిర్మాణానికి మార్గదర్శకమయిన రీతిని ఉదాహరణలతో అశోకుని కాలమునుండి చాళుక్య, పల్లవ, చోళ, పాండ్య కాలములవరకు చర్చించుట జరిగినది. మరియు ఒక ప్రాంత నిర్మాణాలపై పడిన మరొక ప్రాంత నిర్మాణాల ప్రభావము గూడా చర్చించబడినది.

రెండవ విభాగాన ఆంధ్రలోని గుహాలయాల పరిణామదశలు, వాటిపై ఇతర ప్రాంతాల నిర్మాణాల ప్రభావము, ఆయా గుహాలయాల నిర్మాతలు, నిర్మాణ కాలాలు చర్చించబడినది.

మూడవ విభాగమునందు ఆంధ్రలోని విజయవాడవద్ద గల అక్కన్న మాదన్న గుహాలయము, మొగల్‌రాజపురంవద్ద గల గుహాలయాలు, ఉండవల్లివద్ద గల గుహాలయాల వివరాలు తెలుపబడినవి.

నాల్గవ భాగమున ఈ గ్రంథమున ప్రముఖముగా చర్చించబడిన నెల్లూరు జిల్లాలోని భైరవకోనయందలి ఎనిమిది గుహాలయాల వాస్తు, శిల్ప వివరాలతోబాటు వాటి నిర్మాతలగూర్చి వివరణాత్మకముగా, విమర్శనాత్మకముగా చర్చించబడియున్నది.

ఐదవ భాగమున భైరవకోనయందలి శిల్ప సంపదగూర్చి వివరముగా తెలుపబడియున్నది. ఆరవ విభాగాన భైరవకోన గుహాలయాలపై అభిప్రాయాలు ఇవ్వబడియున్నవి. ఏడవ విభాగమున గ్రంథ విషయ గ్రహింపు కొరకు గుహలు, శిల్పాలు, ప్లాన్‌లు మేప్‌లు మొదలగువాటి చిత్రపటాలు ముప్పది ఆరు ముద్రింపబడియున్నవి ఎనిమిదవ విభాగమున ఈ గ్రంథ రచనకు ఉపకరించిన ముఖ్య ఆధారగ్రంథాల పట్టీ ఇవ్వబడియున్నది అంతేగాక గ్రంథ ప్రారంభమున 'ముందు మాట', 'కృతజ్ఞతలు' 'పరిచయం', చిత్రపటాల పట్టీ మొదలగు అంశాలు గలవు.

దేవిరెడ్డి సుబ్రమణ్యం రెడ్డి

చరిత్ర శాఖ
జవహర్ భారతి
కావలి - 524 202
నెల్లూరు జిల్లా, ఏ. పి.

# చిత్రపటాల పట్టీ

## List of Illustrations




చిత్రపటం - 1
భారతదేశంలో వివిధ ప్రాంతాలలో సాగిన ఆలయ నిర్మాణాలు




చిత్రపటం - 2: ఆంధ్రప్రదేశ్‌లోని తొలి వాస్తు నిర్మాణ కేంద్రాలు.

# ఆంధ్ర గుహాలయాలు

## భైరవకోన

ప్రాచీన కాలమునుండి హిందూ దేవాలయాల నిర్మాణానికి, పూజా ప్రతిమల రూపణకు వస్తువును ఎన్నుకొనుటలో ఒక ప్రత్యేకత అగుపడును. ఇది ప్రకృతి పరమైన ఆచారము మరియు కొన్ని చిహ్నముల ఆధారముగా మన దేశమున జరుగుచుండెను. దీనిలో కొయ్య మొదట వాడబడినది. ఈనాటికీ కొన్ని ప్రాంతాలలో దేవతా ప్రతిమల రూపణకు, సనాతనుల గృహోపకరణములకు, సన్యాసుల అవసరాలనేకములకు ఇది వాడబడుట మనము గమనించవచ్చును. కొయ్య తరువాత ఈ నిర్మాణాలకు ఇటుక, సున్నములు (లేక మట్టి) కొయ్యతోబాటు వాడుట ప్రారంభమయ్యెను. కానీ వీటి వాడుక వచ్చినప్పటినుండి ఈ నిర్మాణాలు అపుడపుడు బాగుచేయవలసి వచ్చుచేగాక కొయ్య ప్రతిమలు పాతబడుటచే వాటి స్థానమున కొత్తవి స్థాపించవలసి వచ్చెను. ఇట్టి సాంప్రదాయము ఈనాటికి మనకు ఒరిస్సాలోని పూరి జగన్నాథ దేవాలయములో అగుపడును. ఇచటి దేవగృహం (గర్భగృహ) లోని కృష్ణ, బలభద్ర, సుభద్ర ప్రతిమలు శిల్పశాస్త్ర ప్రకారము ప్రతి పన్నెండేళ్ళకు (Jupiter's siderial period with reference to the sun) మార్చబడును (renewed ritually). తమిళ ప్రాంతమున కూడా కాంచీపురము దగ్గరలోని ఉత్తిరమేరూర్‌లోని పల్లవుల సుందరవరద దేవాలయమందుకూడా కొయ్య ప్రతిమ వాడకము ఈనాటికీ యున్నది (ఈ దేవాలయమందే క్రీ.శ. 914 లోనే ఓటు పద్ధతిలో ఎన్నికలు జరిగెడి విధానమును తెలిపెడి ఒక శాసనము చోళరాజైన ఒకటవ పరాంతకునికి చెందినది గలదు). శాస్త్ర సిద్ధాంతాల ప్రకారము కొయ్య లేక స్టక్కో తో చేయబడిన దేవతా ప్రతిమున్నచో దేవాలయముకూడా ఇటుక, సున్నము (లేక మట్టి) లతోనే నిర్మింపబడవలెను. ఇట్టి దేవాలయాలు పునర్నిర్మాణము జరిగి శిలతో నిర్మింపబడినచో ఇందలి దేవతా ప్రతిమకూడా శిలతో రూపొందింపబడుచుండెను. ఇట్టి ఉదాహరణలలో కాంచీపురమందలి వరదరాజస్వామి దేవాలయము ముఖ్యమైనది. ఈ దేవాలయము మొదట ఇటుకతో నిర్మింపబడినది. కాని క్రీ.శ. 13వ శతాబ్దమున శిలతో పునర్నిర్మింపబడినది. ఇందలి కొయ్య ప్రతిమ భద్రపరచబడినది. ఈ కొయ్య ప్రతిమనే అత్తివరద అందురు. ఇది ప్రతి పన్నెండేళ్ళ కొకసారి ఒక ప్రత్యేక ఉత్సవకాలమున బయల్పరచబడును. స్టక్కో ప్రతిమలకు కూడా అపుడపుడు 'పునుగు చట్టం' అను సున్నము మొదలగువాటితో రూపొందింపబడిన పదార్థముతో శాస్త్ర ప్రకారము పూత వేయబడును.

ఇటుక, సున్నము, మట్టి, కొయ్యతో రూపొందింపబడిన నిర్మాణములతోబాటు దేవాలయానికి శాశ్వతత్వమును, నిర్మాతకు గౌరవము గలిగించెడి పెద్ద ఏక శిలా ఖండములలో గుహల రూపమునగాని (Cut-in or scooped), ఆలయ రూపమునగాని (Cut-out or monolithic)ఆలయాలను రూపొందించుట ప్రారంభమయ్యెను. అనేక రాజవంశాలు అనేక కాలాలలో వీటిని రూపొందించినవి. ఇవి పల్లవులు, పాండ్యులు, చాళుక్యులు, రాష్ట్రకూటులు, యాదవులు, విజయనగర రాజులు, నాయక వంశ రాజులచే మహాబలిపురము, కళుగుమలై, బాదామి, ఎల్లోరా, పన్హలె-కాజి, ధమ్నేర్, దౌలతాబాద్ మొదలగు ప్రాంతాలలో దాదాపు క్రీ.శ. 16వ శతాబ్దము వరకు నిర్మించుట సాగెను.

వీరి ఏక శిలా ఆలయ నిర్మాణాలు పశ్చిమ దక్కన్‌లో యుండిన బౌద్ధ నిర్మాణాల ప్రభావముతో రూపొందింపబడినవని తెలియుచున్నది. కానీ బౌద్ధ నిర్మాణాలు చాలవరకు వ్యాపార వాణిజ్య సంస్థల పోషణలో రూపొందింపబడగా హిందూనిర్మాణాలు రాజులచే పోషింపబడినవి. కాని శిల్పి బౌద్ధ, హైందవ, ఇస్లాం. క్రైస్తవ మతాలన్నిటికీ ఒకడే. In his "Invitation to Indian Architecture" K. V. Soundara Rajan says: "Here are two facets of Indian art — one for Universal humanism which was the guiding light of Gautama, the Buddha and universal divine immanence which causes and orders the phenomenal world, which is the substratum faith of Hinduism, and these together unfold a complementary but evocative psyche of the Indian mind in its relationship with the material world around and the paradise beyond, dwelt in by Gods in their empyrian. The organisation of Buddhist art by influential tradesmen and that of Hindu art by royal dynasties of kings is a dichotemy of Indian art spectrum but was drawing from the same aesthetic ideals and the craft pool. The same craftsmen in medieval times placed their genius add ingenuity at the hands of even Islamic rulers to enrich magnificient edifices to suit their own religious presentations. It only shows how the mind and hand of the artist cannot be held captive in the cage of time, and would find self-expression to suit any environment with a spiritual plank to enthuse them. They were less concerned with material possession, riches, pedigree and could subvert any political power by the persuasive eloquence of their art modulations and bring glory to the land, in the eventuality, and immortality for themselves. Long after the kings are gone, it is the artists and craftsmen who live for ever, to receive their mead of tribute from the entire world."

"The study of Indian religious art is attractive because one is at ease at once with its many splendoured formulations; one finds its study a stint in liberal education of the arts, crafts and thought of the land; and one is stimulated by its naturally exultant stature and stamina. Its majestic layout, with a little understanding, can yet be facile; its formal elaboration, with a modicum of analysis, can still be rational. It is indeed an exercise in exactitude, in symmetry, in organised elegance and disciplined exhuberance." (K. V. Soundara Rajan: Invitation to Indian Architecture, 1984, New Delhi, Arnold Heinemann Publishers, pp. 27, 13).

గుహాలయాలు, స్తూపములు, విహారములు. దేవాలయాలు మొదలగు వాటి వాస్తు నిర్మాణరీతి పరిణామాలు పురావస్తు శాస్త్రమున ఒక ముఖ్య అంశము. ప్రతిమా రూపమున దేవుని ఆరాధించుట. ఆ ప్రతిమకు ఆలయ నిర్మాణము చేయుటలోని ప్రాచీనతగూర్చి మనకు స్పష్టముగా తెలియుటలేదు ఇది బౌద్ధ యుగ కాలపూర్వమునకు చెందిన సాంప్రదాయమై యుండవచ్చును. శుల్బసూత్ర గ్రంథమున బలివేదికల నిర్మాణ ప్రసక్తి ఉంది. కానీ ఇవి దేవాలయాలుగా చెప్పడానికి వీలులేదు. అంతేగాక వాటి ఉపయోగము పరిమితము మాత్రమే.

దీని తరువాతి నిర్మాణదశ క్రీ శ 3 లేక 4వ శతాబ్దమువరకు వెలసినదిగాను, బౌద్ధ యుగానికి చెందినదిగాను చెప్పవచ్చును. కానీ ఈ రెండు దశలలోను మట్టి లేక సున్నముతో సులభరీతిలో నిర్మించుటకు వీలైన ఇటుక ప్రధానముగా వాడబడినది. ఈ దశలోనే స్తూపములు, చైత్యగృహాలు. విహార నిర్మాణాలు జరిగినవి. కాని కొంలది

కాలమునకు ఇటుక స్థానములో శిల వాడుట సాంచి, అమరావతి వంటి ప్రాంతాలలో ప్రారంభమగుటతో వాస్తు నిర్మాణరీతులలో కొన్నిమార్పులు జరిగినవి.

మూడవదశలో బౌద్ధ హిందూ గుహాలయాల నిర్మాణాలు జరిగినవి. ఈ కాలముననే భవిష్యత్తులో జరిగిన దేవాలయాల నిర్మాణాలకు కావలసిన వాస్తు, శిల్పరీతులు రూపుదిద్దుకొనుట జరిగినది.

ఆంధ్రుల హిందూ గుహాలయాలకు సంబంధించి విజయవాడ, మొగల్‌రాజపురము, ఉండవల్లి, భైరవకోనల లోనివి ముఖ్యమైనవిగా చెప్పవచ్చును కాని ఈ గుహాలయాల కాలము, నిర్మాతల విషయములో నేటికిని భిన్నాభిప్రాయములు కొనసాగుచునే యున్నవి. కాని పురాణాలు మొదలగు ప్రాచీన గ్రంథాలనుండి తీసుకొనిన పల్లవ గుహాలయ వాస్తు శిల్పరీతుల ప్రభావము వీటి ద్వారపాలకులు, పూర్ణఘట మొదలగు చిహ్నాములలో మన.కగుపడును.

ఆంధ్రుల చరిత్ర చాలా ప్రాచీనమైనది. వేద యుగానంతర కాలమున రచింపబడిన ఐతరేయ బ్రాహ్మణ గ్రంథమున వింధ్యకు దక్షిణాన గల ఆర్య సరిహద్దుకు అవతల గల భూభాగముంగూర్చి, అచటి తెగలగూర్చి తెలుపబడియున్నది. అట్టి తెగలలో ఆంధ్రులొకరనెడి విషయముగూర్చి కూడా, ఇందు మొట్టమొదట ప్రస్తావించబడియున్నది. సూత్రసాహిత్యము మరింత స్పష్టముగా దక్షిణాపథము, దాక్షిణాత్యులగూర్చి తెలుపుచున్నది. కాని ప్రాచీన బౌద్ధ మత గ్రంథాలు ఈ ప్రాంతమందలి అస్మాక, ములక, అంధక (అనగా ఆంధ్ర) జాతుల గూర్చి పూర్తిగా స్పష్టముచేయుచున్నది. శాసనాలలో ఆంధ్రులగూర్చి అశోకుని శాసనాలలోనే మొదట తెలుపబడియున్నది. తొలి చారిత్రక కాలానికి చెందిన శాతవాహనుల కాలముననే ఆంధ్రులు శక్తివంతమైన విశాల రాజ్యస్థాపన, ప్రాభవములు జరిగి వాస్తు శిల్ప రంగమున ప్రాథమిక మేళిక (substantial) ఘనకార్యములు సాధించబడినవి.

దక్కన్ ప్రాంతముననే మతపరమైన వాస్తు అభివృద్ధి అధికముగా సాగినది. బౌద్ధమతం గంగా మైదాన ప్రాంతమున పుట్టినప్పటికి, ఈ మత గుహాలయాలు అశోకుని కాలాన బీహారులో బరాబర్, నాగార్జుని, సితామర్హి ప్రాంతాన రూపొందించబడినప్పటికి, ఈ మత తొలి శిల్ప వాస్తు నిర్మాణాలు అద్భుతముగా బార్‌హుత్, సాంచి వంటి ప్రాంతాలలో మధ్య దేశముననే జరిగినవి. ఈ స్థితివలన ఒక వైపు శిలా గుహాలయాలు మరొకవైపు తొలి వేద కాలమునుండి కొనసాగుచున్న ఇటుక ఆలయ నిర్మాణాలు వాస్తురీతిలో కొనసాగసాగినవి. దక్కన్‌లో శాతవాహనులు వారి తరువాతివారైన ఇక్ష్వాకులు అమరావతి, నాగార్జునకొండ, గోలి, ఘంటసాల మొదలగు ప్రాంతాలలో ఇటుకతో నిర్మాణాలను (శిలా గుహాలయాల నిర్మాణాల అంతిమకాలమున) ప్రారంభించిరి. అనువైన ప్రాంతాలలో శిలా గుహాలయాలనుగూడ ఈ రాజులు నిర్మించుట చేయసాగిరి. కాని శిలాఖండములు లభించని ప్రాంతాలలో ఇటుకతో నిర్మించబడిన బౌద్ధ, హిందూ నిర్మాణాలు విస్తృతముగా ఇదే సమయమున వ్యాప్తి చెందసాగెను. ఈ వ్యాప్తిదశకు చెందినవే ఉత్తరాన గంగా తీరమందలి తొలి గుప్త దేవాలయాలు, దక్కన్‌లోని నాగార్జునకొండ, నాచ్‌నకుథార, బితర్గాన్ లందలి తొలి దేవాలయాలు.

కట్టడ నిర్మాణాలలో ఇటుక బదులు శిల వాడకము ప్రారంభమగుటకు మునుపే ఏక శిలా గుహాలయాలు రూపొందించుట తిరిగి ప్రారంభమైనది. K. V. సౌందరరాజన్ అన్నట్లు, ''Before brick could be replaced entirely by stone, the vogue had changed again transiently in favour of rock-cut architecture, primarily due to the fact that the rock-cut enterprise is not only more awe-inspiring, but also inevitably committed the labours and religious fervour of whole communities in the task, and produced far-reaching results in ethical and religious harmony''. ప్రాంతీయ

ఇటుక, కొయ్యల నుపయోగించి నిర్మించిన వాస్తు శిల్పములు ఏక శిలలో వికసించుట మనకు ఈ దశలో అగుపడును. ఉదయగిరి (గ్వాలియర్), అజంతా, తొలి ఎల్లోరా, బాదామి, మహాబలిపురం, గుంటుపల్లి, శంకరం గుహాలయాలు ఈ తెగకు చెందినవే. ఏక శిలా నిర్మాణాలపై గల మోజును ఏక శిలతో నిర్మింపబడినవైన ఎల్లోరా కైలాస దేవాలయం, మహాబలిపుర పంచపాండవ రథాలు, కలుగుమలై ఆలయములు తెలుపుచున్నవి. కైలాస దేవాలయము ఒక అద్భుతమైనది "the first of which (Kailasa temple) is by any standard an exceptional effort on a challenging medium (stone)". కానీ ఇదే కాలమున ఏక శిలా నిర్మాణములతోబాటు కొన్ని ప్రాంతాలలో శిల నుపయోగించి దేవాలయాలను కట్టెడి విధానము ప్రారంభించుటకూడా జరిగినది. ఐహోళె (కర్నాటక), నాచ్‌న (మధ్యప్రదేశ్), దేవోఘర్ (గ్వాలియర్) మొదలగు ప్రాంతాలలో క్రి. శ. 6వ శతాబ్దమునను, కాంచీపురము, బాదామి, పట్టదకల్, ఐహోళె, అలంపూర్‌లలో క్రి. శ. 7వ శతాబ్దము ఆఖరులోను, క్రి. శ 8వ శతాబ్దము తొలిదశ లోను జరిగిన దేవాలయ కట్టడాలు ఈ కట్టడ దేవాలయాల వాస్తురీతి పునః ప్రారంభదశను తెలుపుచున్నవి. వీటిలో అలంపూర్ దేవాలయాలు, ఐహోళె దేవాలయాలు, గుప్తానంతర మధ్యదేశ దేవాలయాలు, గుజరాత్, రాజస్థాన్ సరిహద్దులో గల 'రోడ' యందలి దేవాలయాలు, మార్వార్‌లోని ఓసియన్‌లోని 'ప్రతిహారుల' దేవాలయాలు, 'ముఖలింగ' మందలి గాంగరాజుల దేవాలయాలవలె పరిణామ దశనుగాక పరిణతి దశ నిర్మాణరీతిని తెలుపుచున్నవి. ఈ పరిణతి దశ కొలదికాలమునకు దేదీప్యమానము (magnificience) మరియు అతివ్యయము (extravagence) నకు (దేవాలయ కట్టడాలలో) దారితీసినది. దీనికి ఉదాహరణగా ఆంధ్రలోని సింహాచలం, పాలంపేట మొదలగు దేవాలయాలను చెప్పవచ్చును.

కాని మలిదశ దేవాలయ కట్టడాలలో అనుకరణకు, నాణ్యత (quality) కన్నా క్వాంటిటీకి ప్రాధాన్యత అగుపడును. శిల్పమందు కూడ మొతుకదనము (coarseness) మరియు కాఠిన్యము (rigidity) అగుపడును.

ఆంధ్రప్రదేశ్‌లోని దేవాలయాలు తొలినుండి కూడ దేశమున నిర్మింపబడియున్న అనేక వాస్తు శిల్ప నిర్మాణ రీతుల ప్రభావమునకు లోనగుచు ఒక నూతన మిశ్రమ తరహా వాస్తు శిల్ప రీతికి అవకాశమిచ్చినవి. క్రింది వాక్యము లలో ఇది మన కగుపడును. "The temples of Andhra Pradesh, from their adolescence to decay, were constantly subjected to influence of architectural and art impulses from the centre of early art endeavour and were thus, to a certain extent, amalgams in structural mode. The elegance of the nagara sikhara profile and its typical wall decorative motifs as from Central India, the stamina of the Deccani, clarity of ground plan and sumptuous yet suave figure – sculpture as from Aiholi, the almost effiminate grace of the Orissan art and architectural trends, the prodigious industry and craft superiority of the later Chalukyan temples of the Deccan and Karnataka, the majestic stature and solid strength of the southern Dravidian temple forms and profiles, all seeped into the Andhra mould, and enlarged its mass appeal and enriched the artistic vision. The innate acumen of the Andhra craftsmen who had had an unbroken tradition of art endeavour right from the time of the Imperial Satavahanas, and whose Canvas had an enviable with of geographical horizan enveloping the western and the eastern seas, and the Ganga and the Pennar plains, responded to their adventitious central location for receiving and harmonising these traditions of their near and distant neighbours. In sum, the sweeping panorama of the

architectural creations of Andhra Pradesh from the early historic upto early medieval times was composite to a large extent, and electric to the core. The fertile plains of the Godavari and the Krishna had this spirit of assimilation operating in spheres religious as well as temporal" (K. V. Soundara Rajan).

*ఆంధ్ర గుహాలయాల పరిణామ దశలు, నిర్మాతలు :*

ఆంధ్రుల వాస్తు పరిణామ చరిత్రలో గుహాలయాల పరిణామ దశలు ఒక ప్రముఖస్థానమును కలిగియున్నవి. ఆర్థిక పురోభివృద్ధి, సాంస్కృతిక ఔన్నత్యములు అతి ప్రాచీనకాలమునుండి ఆంధ్రలో ఏర్పడిన కారణముగా ఇతర ప్రాంతాల ప్రభావములకుకూడ ఇది లోనగుచుండినది. శాతవాహనుల తరువాత ఇక్ష్వాకులు, వారి తరువాత కంచి కేంద్రముగా గల పల్లవులు ధాన్యకడ (అమరావతి) లో ప్రతినిధిని కలిగి కృష్ణానదీ పరిసర ప్రాంతాలను పరిపాలించిరి. పల్లవులు తూర్పు ఆంధ్రలోని కృష్ణా తీరముననే గాక పశ్చిమాంధ్రలోని 'శాతవాహని రట్ట' యనెడి నేటి బళ్ళారి ప్రాంతమును కూడ పాలించిరి. బహుశా ఈ బళ్ళారి పల్లవుల స్వాధీనమందుండిన కాలముననే పల్లవులు దక్కన్‌లో వీరికి పూర్వపు రాజవంశాలవారు రూపొందించిన గుహాలయాలగూర్చి తెలుసుకొనుట జరిగియుండవచ్చును. ఈ వాస్తు రీతినే (గుహాలయాల నిర్మాణము) సింహవిష్ణు వంశజుడైన నవీన పల్లవ రాజు మొదటి మహేంద్రవర్మ తమిళ ప్రాంతమున కఠిన గ్రనైట్ శిలలో ప్రారంభము చేసెను. ఈ ఘనతకు తగ్గరీతిలో ఇతడు తన 'మందగప్పట్టు' శాసనములో చెప్పబడినట్లు 'విచిత్రచిత్త' మొదలగు బిరుదులు ధరించినాడు.

ఆంధ్రరాష్ట్రములోని కృష్ణా, గుంటూరు జిల్లాలలోని విజయవాడ, మొగల్ రాజపురము. ఉండవల్లి ప్రాంతాలలోని గుహాలయాలు, నెల్లూరు జిల్లాలోని భైరవకోన గుహాలయాలు (ప్రాంతాలకు 1. 2 చిత్రపటాలు చూడుము) పల్లవ నిర్మాణాలుగా కొందరు, మరికొందరు విష్ణు కుండిన రాజులు లేక క్రీ. శ 6వ శతాబ్దమున (Late 6th century A. D.) దిగువ కృష్ణానదీ ప్రాంతాలలో పరిపాలించిన (చాళుక్యరాజైన రెండవ పులకేసి తీరాంధ్ర ముట్టడికి పూర్వము) తెలుగు చోడరాజులు లేక తూర్పు చాళుక్యులు నిర్మించియుందురని భావించుట కలదు. నిజమేదియో తెలుసుకొన వలసియున్నది. కాని ఈ రాజవంశాలు ఒకరినుండి మరొకరు వాస్తు రీతులను స్వీకరించుట మనకగుపడును.

విష్ణుకుండినులు దక్కన్‌లోని వాకాటక రాజవంశాల సమకాలికులుగా యుండుటేగాక వారితో శత్రుత్వము కలిగియుండుట వలన యుద్ధాల కాలాలలో వారి వాస్తు శిల్ప రీతుల గూర్చి తెలుసుకొనెడి అవకాశము ఏర్పడి అట్టి నిర్మాణాలను వీరు పై ప్రాంతాలలో నిర్మించి యుండవచ్చును. విష్ణుకుండినులు హైందవ మతాభిమానులు. అంతే గాక ఈ వంశజులలో మొదటి మాధవర్మ, మూడవ మాధవర్మలు అశ్వమేధ, అగ్నిష్టోమ. హిరణ్యగర్భ యజ్ఞములను, మహాదానములను చేయుటే గాక తమ వంశ (కుటుంబ) మంతయు శ్రీపర్వతస్వామికి అంకితమైన భక్తులుగా (నల్లమల కొండలలోని శ్రీశైల మల్లికార్జున స్వామి) చెప్పుకొనుట కూడా ఈ గుహలన్నియు వీరే నిర్మించియుండవచ్చునని అభిప్రాయము గలదు. ఇదే నిజమైతే ఇవి రెండవ పులకేసిచే కునల (కొల్లేరు సరస్సు) ప్రాంత యుద్ధమున ఓడిపోయిన వేంగీ రాజ్యాధిపతి మూడవ మాధవ వర్మ (C. 556—616 A. D.) లేక అతని కుమారుడు వీటి నిర్మాతలై యుండవచ్చును కాని యుద్ధమొక ప్రక్క చేయుచు ఇది సాధించగలిగి యుండెడి వారా యని సందేహమేర్పడును.

పల్లవులే ఆంధ్రలోని గుహాలయ నిర్మాతలనుటలో కూడా ఇదే సందేహమేర్పడును. మొగల్‌రాజపురము గుహాలయాలు పల్లవ మహేంద్రవర్మ నిర్మాణాలుగా (ఐదవ గుహలోని పూర్ణ ఘట రూపము, నాల్గవ గుహలోని

ప్రక్క నిర్మాణాల రీతులు మినహా) మనకు తోచును. ఉండవల్లి గుహలు పల్లవేతర నిర్మాణాలుగా, బహుశా చాళుక్య నిర్మాణాలుగా తోచును. భైరవకోన గుహలు పరిణతి చెందిన గుహాముఖ భాగముతో పల్లవ మామళ్ళ రీతికి దగ్గరగా అగుపడును. కానీ ఇచట గుహాలయాల ముందు ఏకశిలా నంది రూపణ పల్లవేతర రీతిని సూచించును. కాని ఇచటి పల్లవ గ్రంథ లిపిలోని క్లుప్త శాసనములును, త్రిమూర్తులలోని శివునికి దేవగృహంలో శివలింగ రూపస్థానము, గుహ వెలుపల ఇరువైపుల విష్ణు బ్రహ్మలకు స్థానములు కల్పించుటను పరిశీలించినచో పల్లవ రీతిని స్పష్టముగా తెలుపుచున్నవి. అంతేగాక విజయవాడ వద్ద గల అక్కన్న మాదన్న గుహాలయంలోను, ఉండవల్లిలోని ఒక గుహాలయంలోను, భైరవకోన గుహాలయంలోను, మహారాష్ట్రలోని ఔరంగాబాదు జిల్లాలోని ప్రాచీన భోగవర్ధన ప్రాంతమైన నేటి భోకార్ధన్‌లోని గుహాలయాలలోని ప్రాచీన తెలుగు-కన్నడ లిపిగా చెప్పబడుచున్న క్రీ.శ. 7వ శతాబ్దకాల లిపిలో గల "ఉత్పతిపిడుగు" గా పలుకబడుచున్న ఒక బిరుదుబట్టి ఈ గుహలు గల ప్రాంతాలన్నింటినీ ఒకేరాజు ఆక్రమించి అతనిచే ఈ గుహాలయ వాస్తు రీతి ప్రవేశపెట్టబడినట్లు భావించుట గలదు ఈ కాలమున ఈ ప్రాంతాలాక్రమించి ఘనత సాధించినవాడు పల్లవరాజు ఒకటవ మహేంద్రవర్మ యని చెప్పవచ్చును. పల్లవ రాజ్యము మొదలుకొని చాళుక్యుల రాజధాని బాదామి (వాతాపి) వరకు క్రీ శ. 7వ శతాబ్దమున ఆక్రమణ చేసినవాడు ఇతడే

కాబట్టి వాస్తు రీతుల ఆధారముగనే పై గుహాలయాల నిర్మాతలగూర్చి నిర్ణయించవలయును ఒక నిర్మాణముయొక్క కాలాన్ని ఆ నిర్మాణములోని స్తంభములు, కార్బెల్స్, కార్నిస్, శిల్పరూపణ, గ్రౌండ్ ప్లాన్, గుహాలయాలు అంకితము కాబడిన దేవతలు మొదలగువాటి ఆధారముగా నిర్ణయించవలెనని లాంగ్‌హర్స్ట్‌వంటి పురావస్తు శాస్త్రజ్ఞులు భావించినారు. పైరీతిలో పరిశీలించినచో తమిళ ప్రాంతాలలోవలె అంతస్తులులేని గుహాలయాలవలె నిర్మింప బడిన మొగల్‌రాజపురము, భైరవకోన గుహాలయాలు పల్లవ నిర్మాణాలుగను, అంతస్తులు గల గుహాలయాలతో కూడిన ఉండవల్లి గుహలు, దక్కన్ ప్రభావములో గల చాళుక్య నిర్మాణాలుగాను భావించవచ్చును కాని భైరవకోనలో గుహాలయాలు పాక్షికముగా అంతస్తులతో నిర్మించుట జరిగినట్లు అగుపడును. ఒక్కొక్క స్థాయిలోని ఈ గుహలు వేటికవి ప్రత్యేకముగా ఇచట అగుపడును. స్తంభాలు, కేపిటల్, కార్నిస్, ఆర్కిట్రేవ్ మలి (later) పల్లవ (మామల్ల) రీతిలో అగుపడును కాని వీటి స్తంభ కాండమునకు (pillar shaft) కి fluted character లేదు. కాండముపైన 'తడి', 'ఫలక' లేదు కాని చాళుక్య రీతిలోవలె 'కలశ', 'కుంభ' యుండుటేగాక ఇవి ఒక nuxes loca' genesis మరియు మామల్ల తరువాతి రీతికి దగ్గరగా యున్నవి.

భైరవకోన రెండవ, ఐదవ గుహాలయాలపై గల క్లుప్తశాసనాలు కూడ ఈ గుహలు పల్లవులచే నిర్మింప బడినవిగా భావించుటకు అవకాశ మిచ్చుచున్నప్పటికీ ఇవి వేంగీ చాళుక్యులు లేక తెలుగు చోడులచే నిర్మింపబడి యుండవచ్చునని భావించుటకు అవకాశము గలదు.

మొగల్ రాజపురములోని ఐదవ గుహలోని పూర్ణఘట రూపణ పల్లవేతర రీతిని తెలుపుచున్నది. ఇది శాతవాహన, ఇక్ష్వాకు కాలమునాటి బౌద్ధ నిర్మాణాలలో యున్నటువంటి పూర్ణఘట వలెను, క్రీ.శ. 6వ శతాబ్దము రెండవ అర్ధభాగమునకు చెందిన తొలి (పశ్చిమ) చాళుక్యుల ఐహోలెలోని దేవాలయములోను, తరువాత ఒక శతాబ్దానికి నిర్మింపబడిన ఔరంగాబాద్ గుహాలయములలోను అగుపడెడి పూర్ణఘట రూపణవలె యున్నది ఇచటి ద్వారపాలురు కూడ తమిళ ప్రాంతములోని పల్లవ ద్వారపాలురకన్నా తక్కువ రమ్యత (suave) కలిగియున్నారు. అంతేగాక వారి "very stance is different". ఇచటి నాల్గవ గుహాలయ ముఖభాగముపైన, పైకప్పు భాగాన తాండవశివుని శిల్పరూపణ చేయబడియున్నది. ఇది క్రీ.శ. 7వ శతాబ్ద ప్రారంభమున చాళుక్య దేవాలయాలలో సుకనాస భాగమున నిర్మింపబడెడి తాండవశివుని రీతిని స్ఫురింపజేసి ఈ గుహ చాళుక్య నిర్మాణముగా తెలుపుచున్నది.

భైరవకోన గుహాలయాలు పైకి పల్లవరీతిని కలిగియున్నట్లగుపడును. కాని కార్నిస్ భాగములోని నాసికలు శిఖ (crest) భాగమున వ్యాళను కలిగియున్నవి. ద్వారపాలురు langorous మరియు గుండ్రటి (rotund) రూపముల (figures)ను కలిగి కీలు (joint) భాగాలలో బిరుసు (stiffness) ను అననుపాల (disproportionate) అవయవములను కలిగియున్నవి. స్తంభాలుకూడ పల్లవ, చాళుక్య (early 7th century A D.) రీతి మిశ్రమాన్ని కలిగియున్నవి. ముఖ్యముగా కాండము, 'కలశ', 'కుంభ' భాగాలలో ఇది అగుపడును. కుంభ భాగమున అష్టకోణాకృతి గల (kattu) సంగమ ప్రాంతమున చతురస్రాకార కాండము పై భాగమైన 'సందురం' పై విభాగమున గల 'పద్మబంధ' పుష్పముల ఉంగరాకార (loops) వివరాలలో ఇది అగుపడును ఇవన్నియు చాళుక్య వాస్తురీతి ప్రభావమును తెలుపుచున్నవి. గుహాలయ ముఖభాగములు కూడ అటు పల్లవరీతినిగాని ఇటు చాళుక్యరీతిని గాని పూర్తిగా చూపుటలేదు.

అంతేగాక తమిళప్రాంతాలలో గుహాలయాల నిర్మాణాలకు మహేంద్రవర్మ కఠినశిల (hard granite) ఉపయోగించగా, మొగల్‌రాజపురము, ఉండవల్లి గుహాలయాలు మెతువురాయి (sandstone)లో రూపొందించబడగా భైరవకోన గుహాలయాలు schistoseలో రూపొందింపబడియున్నవి.

కాబట్టి మొగల్‌రాజపురము, ఉండవల్లి, భైరవకోన గుహాలయాలు పల్లవ ప్రభావాన్ని కలిగియున్నప్పటికి పల్లవేతర నిర్మాణాలుగా భావించుటకుకూడా అవకాశమిచ్చుచున్నవి. ఈ గుహాలయాల ప్రభావము తరువాతి నిర్మాణాలపై మన కగుపడదు. కాని తమిళ ప్రాంత గుహాలయాలు తరువాతి నిర్మాణాలపై తమ ప్రభావాన్ని చూసినవి.

ఇవి క్రీ. శ. 7వ శతాబ్దము రెండవ అర్ధభాగమునుండి క్రీ. శ. 8వ శతాబ్దాంతపు పూర్వకాలమున నిర్మింప బడినవిగా చెప్పబడుచున్నవి. ఈ కాలముననే ఆంధ్రలోని అలంపూర్ దేవాలయాలు చాళుక్య, రాష్ట్రకూట, ఒరిస్సా దేవాలయాల ప్రభావముతో నిర్మింపబడినవి.

# ఆంధ్ర గుహాలయాలు

*విజయవాడ అక్కన్న మాదన్న గుహాలయము :*

విజయవాడవద్ద గల ఇంద్రకీల పర్వతపు తూర్పు, పశ్చిమ వాలు భాగాలలో గల గుహాలయములలో తూర్పుభాగాన గల అక్కన్న మాదన్న మండపమనెడి రెండవ గుహాలయము ముఖ్యమైనది (3, 4 చిత్రపటములు చూడుము). ఇది పెద్దది, అందమైనది. ఇందు ముందుభాగాన ఒక స్తంభ వరండా కలిగి దాని వెనుకభాగమున మూడు దేవగృహాలను కలిగియున్నది శిల్పరూపాలు మొదలగున వేమియు లేకుండా యున్నది. స్తంభాలు అష్టకోణాకార విభాగమును కలిగియున్నవి. ఈ స్తంభాలు పల్లవేతర వాస్తురీతిని తెలుపుచున్నవి. కాని గ్రౌండ్ ప్లాను పల్లవరీతితో యున్నది. ఈ గుహ ప్రాంతీయ పోషణతో ఏర్పరచబడినదని భావించుటకూడ గలదు. ఇచటి క్లుప్తశాసనంలోని "ఉత్పతి పిడుగు" అనెడి బిరుదునుబట్టి ఇది క్రీ శ. 7వ శతాబ్దమునకు చెందినదిగా తెలుసుకొనుటకు ఉపయోగపడుచున్నది.

*మొగల్‌రాజపురం గుహాలయాలు :*

మొగల్‌రాజపురం గుహాలయాలు విజయవాడకు తూర్పున మూడుమైళ్ళ దూరంలో ఉత్తర దక్షిణములుగా యున్న కొండలలో గలవు. మొగలరాజపురం గ్రామమునకు ఆగ్నేయమున గల పర్వతమున ఒకటవ గుహాలయము,

పర్వత దక్షిణభాగాన రెండవ, మూడవ గుహాలయాలు, అచటనే (దుర్గ దేవాలయమునకు పశ్చిమాన) రెండు ఫర్లాంగులలో గల మరొక పర్వత ఉత్తరభాగాన నాల్గవ గుహాలయము, దీనికి వాయవ్యాన గల మరొక కొండపై ఐదవ గుహాలయము గలవు.

ఒకటవ గుహాలయము మూడు దేవగృహములను కలిగియున్నది. వీటి ముందు అన్నింటికి కలిసి ఒక వరండా కలదు. ఇది ముఖ భాగమున రెండు స్తంభాలను కలిగి మండప ఎడమ కుడి కొసలలో రెండు అర్ధ స్తంభాలను కలిగియున్నది.

రెండవ గుహాలయము సుమారు 7 అ॥ 6 అం॥ చతురస్రము గల ఒకే దేవగృహమును కలిగి దాని ముందు దేవగృహమునకన్నా రెండింతలు గల దీర్ఘచతురస్రాకార వరండా కలిగియున్నది. దీని ముఖ భాగమునకు సపోర్టుగా రెండు సాధారణ స్తంభాలు, వరండాకు ఎడమ కొసలలో రెండు స్తంభాలు గలవు.

మూడవ గుహాలయము చాలవరకు రెండవ గుహాలయమువలె యున్నది. కాని దీని దేవగృహము చిన్నదిగా యున్నది. సుమారు 6 చ॥ అ॥ యున్నది. దీనిముందు గల మండపము సుమారు 12 అ. 9 అం. చతురస్రాకారముగ యున్నది కానీ దీని ముఖభాగము కపోత (కార్నిస్)ను, అందు చైత్య కూడులను మూడింటిని కలిగియుండుటేగాక దీని వెనుకగా పై అంతస్తు గుహాలయ అంతర పట్టికలను, సాదా లూపములను కలిగియున్నది. ఈ గుహా స్తంభాలు ఘనచతురస్రాకార, ఆక్టాగనల్ సెక్షన్ విభాగాలను కలిగియున్నవి. ఇచటి దేవగృహాలో వెనుక కుడ్య ముఖభాగాన మొరటుగా రూపొందింపబడిన దుర్గ ప్రతిమ గలదు.

ఈ గుహాలయ ముఖభాగపు తూర్పు విభాగాన శిథిలదశలోని త్రిమూర్తులు గల కూడు యుండగా, పశ్చిమ విభాగాన అసంపూర్తిగా వున్న త్రిమూర్తుల చిత్రము గలదు. ఈ శిల్పమునకు పశ్చిమాన ఎవరినో వధించుచున్న యుద్ధవీరుని ఉర్ధశిల్పము, క్రీ శ. 8 లేక 9వ శతాబ్దమునకు చెందిన శిథిలమైన (తొలి) తెలుగు శాసనము గలవు. ఒకటవ గుహాలయము తొలి దశకు చెందినదిగను; రెండవ, మూడవ గుహలు తరువాతి దశకు చెందినవిగను చెప్ప వచ్చును. మూడవ, నాల్గవ గుహలు చాలవరకు తమిళ ప్రాంతమందలి పల్లవ మహేంద్రవర్మ గుహలను పోలియున్నవి.

నాల్గవ గుహాలయము మొగల్‌రాజపురం గుహాలయాలన్నింటిలోకి పెద్దదేగాక శిథిలముకాకుండా యున్న పరిణతిచెందిన దశకు చెందినదిగా చెప్పవచ్చును (5, 6 చిత్రపటములు చూడుము).

ఇది ఓపన్ ముఖమండపమును గలిగియున్నది. గుహాలయ ముఖభాగమున entablatureనందు గల కాపిటల్ భాగమున తరంగ కార్బెల్ గలదు. అంతేగాక సాదాగా అడ్డానికి రూపొందింపబడియున్న చూరు అత్తడ (eavesboard) 'కపోత' (roll-cornice) క్రిందిభాగమున గలవు. 'కపోత' పై విభాగాలలో 'చైత్య' ('కూడు') లేక 'నాసిక' విభాగాలు గలవు. వీటి మధ్యభాగాన దేవీసమేతుడైన విష్ణు, దేవీసమేతుడైన శివుడు, మూడు శిరస్సుల బ్రహ్మ వరుసగా కుడినుండి ఎడమవైపుగా రూపొందింపబడియున్నారు. ఈ 'కూడు' లేక 'నాసిక'ల crest భాగమున 'సింహలలాట' విభాగము గలదు. కార్నిస్ పై విభాగమున వెనుకగా ఏనుగులు, సింహముల అర్ధ శిల్పముల వరుస కలదు. వీటి పై విభాగాన మధ్యగా శిథిలదశలో గల అర్ధశిల్పరూప తాండవశివుడు గలడు. మండప ముఖభాగమున గల పల్లవ మహేంద్రవర్మ రీతిలో గల లావుపాటి "సదురం - కట్టు - సదురం" రకమునకు చెందిన స్తంభములు గలవు. వీటి లోపలి ముఖభాగపుపై 'సదుర' ముఖ భాగాన గల 'పథకము'లు (medallions) విష్ణు, కృష్ణుల గజేంద్రమోక్ష, పూతన సంహార ఘట్టములను, గంధర్వులను గలిగియున్నవి. గుహ యొక్క ముఖ

భాగ స్తంభముల వరుసలోనే కుడి ఎడమ కొసలలో ముందుకు చొచ్చుకొనియున్న స్తంభాలు గలవు. ఈ కొసలలోనే రెండువైపులా దిక్పాలురు గలరు. వీరు చెరొకరు ఎడమ, కుడి చేతులను బరువైన గదపై కలిగి మరొక చేతిని (తూర్పువైపు ద్వారపాలుడు) కటి హస్తరీతిలోను, (మరొకరు) విస్మయ హస్తరీతిలోను కలిగియున్నారు. వీరి ఉత్తరీయము యజ్ఞోపవీత వైపుగా దేహముపై కలిగి పల్లవరీతిలో వలె కుడిచేతిపై ఆనియున్నది. ద్వారపాలురు తలలపై కొమ్ములు గలిగి, వాటి మధ్య శిరోవస్త్రము కలిగియున్నారు.

దీని వరండాయందు స్వేచ్ఛగా నిలబడియున్న నాలుగు స్తంభములు, రెండు "engaged" స్తంభములు ఏర్పరచియున్నందున వరండా రెండు విభాగాలుగా విభజింపబడియున్నది. వీటి వెనుక ఒక అదిష్ఠానముపై మూడు గుహాలయములు గలవు. మధ్యది ఆఖరుదానికన్నను కొంత పెద్దదిగా యున్నది. ఈ గుహాలయము శివునికి అంకిత మైనది. కానీ ఇరువైపుల విష్ణు, బ్రహ్మలు గలరు. ఈ గుహాలయము ముందు గల 'ముఖమండప' ప్రక్క భాగాలలో స్తంభమండపములు గలవు. తూర్పుది స్పష్టముగా రూపొందింపబడినప్పటికీ, పశ్చిమ భాగముది అసంపూర్తిగా వదలివేయబడియున్నది. ఇట్టి విధానము ఎల్లోరా, ఐహోలె మొదలగు ప్రాంతాలలో గల తూర్పు చాళుక్య సాంప్రదాయమును తెలుపుచున్నవి. ఇదియే త్రికూట ఆలయ నిర్మాణాలకు మార్గదర్శకమని భావింపవచ్చును.

ఐదవ గుహాలయము తూర్పుముఖముగా వున్నది. దీని ముఖమండపము వెనుక ఒకే దేవగృహము గలదు. దీనికి పిలాస్టర్ ద్వార విభాగము గలదు. దేవగృహమునకు ఇరువైపులా ఇద్దరు ద్వారపాలురు గలరు. వీరు ఖడ్గము, డాలు గలిగి తమిళ ప్రాంతమందలి శియమంగళ గుహాలయములోని ద్వారపాలురవలె వున్నారు. మండపమందు అనేక స్తంభములు గలవు. గుహ ముఖభాగపు (facade) దక్షిణ కొనభాగాన చొచ్చుకొనియున్న కుడ్య స్తంభము పూర్ణఘటను గలిగియున్నది. ఈ పూర్ణఘట రూపము ఔరంగాబాదు, ఎల్లోరా మొదలగు ప్రాంతాల బౌద్ధ నిర్మాణాలలోను, ఐహోలె వంటి ప్రాంతాలలోను కల తొలి హైందవ దేవాలయములలో అగుపడును.

*ఉండవల్లి గుహాలయము :*

ఉండవల్లి గుహాలయాన్ని ప్రాంతీయముగా అనంతశయన గుడి (గుహ) యందురు. రెండవ అంతస్తు లోని అనంతశయన విష్ణు ప్రతిమవలన దీనికీ పేరొచ్చినది. ఇది కృష్ణ ఉత్తర ఒడ్డున వున్న విజయవాడకు ఎదురుగా కృష్ణ దక్షిణ ఒడ్డున (గుంటూరు జిల్లాలో) గుంటూరు విజయవాడ మధ్య (విజయవాడ తరువాత రెండు మైళ్ళ దూరంలో) గల తాడేపల్లి రైల్వే స్టేషన్‌కు వాయవ్యమున ఉన్నది. ఇచటి గుహాలయము ఈశాన్యముఖముగా ఉన్నది.

గ్రౌండ్ ఫ్లోర్ భాగము తప్ప మిగిలిన ఈ గుహాలయపు మూడు అంతస్తులు (7వ చిత్రపటము చూడుము) సుమారు 50 అ॥ ఎత్తుగలిగి, వీటి ముందుభాగము 90 అ॥ పొడవు యున్నది. గ్రౌండ్ ఫ్లోర్ అసంపూర్తిగా వున్నది (8వ చిత్రపటము చూడుము). సాదా హాలు కలిగి లావైన ఘన చతురస్రాకార స్తంభములను కలిగి వున్నది. కాని ఒకటవ ఫ్లోర్ భాగము విశాలముగా వున్నది (9వ చిత్రపటము చూడుము). ఇందలి స్తంభాలు మొరటుగా, ఘనచతురస్ర, ఆక్టాగనల్ విభాగాలను గలిగి, పైభాగాన బరువైన తరంగ కార్బెల్, దానిపైన ఒక "frieze of geas", అటుపైన బరువైన 'కపోత' (roll cornice) (దానికి చైత్య'కూడు' విభాగాలు) గలవు. గుహ లోపలి విభాగము స్తంభ మండపాన్ని గలిగి దాని వెనుక గోడభాగమున దేవగృహము ఏర్పరచబడి దేవతా ప్రతిమ లేక శివలింగ స్థాపనకు 'పీఠము' ఏర్పరచబడియున్నది. ఈ మధ్య (కేంద్ర) దేవగృహమేగాక దీనికి ఎడమ రెండు, కుడివైపున మరొక దేవగృహము కలవు. ఎడమవైపు కొసనున్నది చిన్నది. ఈ దేవగృహాలన్నిటికి

ఒక స్తంభ మండపము గలదు. కేంద్ర దేవగృహానికి కూడా ప్రత్యేక స్తంభ మండపము గలదు. ఉత్తరపు చిన్న దేవగృహమందే ద్వారపాలురు గలరు. ఇచటి దేవగృహాలు, మంటపాలు ఎల్లోరా గుహాలయములను పోలి యున్నవి. మొదటి అంతస్తుకు గ్రౌండ్‌ఫ్లోర్ నుండి మెట్లు లేవు. కాని మొదటి అంతస్తునుండి పై అంతస్తుకు మెట్లు గలవు. దీనివిబట్టి గ్రౌండ్ ఫ్లోర్ ఇచటి దేవగృహాలలో మలిదశకు చెందినదై వుండవచ్చునని చెప్పవచ్చును.

రెండవ అంతస్తులోని దేవగృహ ఉత్తర దక్షిణాలుగా వున్నది. మొదటి అంతస్తు దేవగృహవలె తూర్పు పడమరలుగా లేదు. ఇచటి స్తంభ మండపము 50 అ॥ పొడవు, 28 అ॥ వెడల్పు గలిగియున్నది. దేవగృహము 12 అ॥ పొడవు, 13 అ॥ 9 అం॥ వెడల్పు గలిగియున్నది. ఈ పరిమాణముల వలననే ఇది ఉత్తర దక్షిణాలుగా శిలాఖండ పరిమితివలన రూపొందించవలసివచ్చెను. ఇచటి దేవగృహలో అనంతశాయి విష్ణు ప్రతిమ తూర్పు పడమరలుగా రూపొందించబడి ఉత్తర కుడ్యము దగ్గరలో వున్నది

ఇది పల్లవరీతి గుహగా భావింపబడుచున్నప్పటికి ఇది పల్లవేతర గుహలైన ఔరంగాబాద్ బౌద్ధ గుహాలయములను కొంతవరకు పోలియున్నది పల్లవ మహేంద్రవర్మ తరువాతి కాలమునకు చెందిన మహాబలిపురమందలి మహిష మర్దని గుహాలయముతో పోల్చుటకు ఇది సరిపడుట లేదు. కాని ఇచటి మండప, దేవగృహ, స్తంభముల సింహాలు (ఒక పాదం పైకి యుండుట) మహేంద్రవర్మ తరువాతి రీతి నిర్మాణాలుగా సూచించును. మూడవ అంతస్తులోని గుహ ముఖభాగము (facade) లోని 'కూటశాల' వరుసలు మామల్ల పూర్వ వాస్తు రీతిలో అగుపడవు. కాని పట్టదకల్, ఎల్లోరాలలో రాష్ట్రకూట నిర్మాణాలలో వలె అగువడును. చక్యాన్‌లోని ఇట్టి గుహాలయాల వివరాలుగూర్చి బాగా తెలిసినటువంటి, ఈ గుహాలయాల ప్రాంతాలను పాలించినటువంటి రాజవంశజులు విష్ణుకుండినులు లేక తూర్పు చాళుక్యులై యుండవచ్చు.

ఆఖరిదైన పై అంతస్తు మూడు దేవగృహాలను కలిగియున్నది. భైరవకోన గుహాలయాల స్తంభాలు వంటివి ఇచట మనకగుపడును.

ఇచటి కొండపైననే అసంపూర్తిగా వదిలివేయబడిన నాలుగు గుహాలయాలు గలవు. వీటిలో ఒకటి మూడు దేవగృహాలను, మిగిలినవి ఏక దేవగృహాన్ని కలిగియున్నవి.

ఇవేగాక మహాబలిపురములోని అర్జున తపో సంఘటనలోని రథమువంటి దేవగృహవలె ఇచట ఆరు (రథముల వంటి నిర్మాణములు) గలవు (10వ చిత్రపటము చూడుము). బరువైన 'కపోత' (heavy roll cornice), సాదా కుడ్య స్తంభాలు, 'కూడు' లేక 'మకర పంజర' లతోపాటు 'అధిష్టాన', 'కుముద', 'వేదిక', 'శిఖర', 'కలశ' విభాగాలనుకూడా కలిగియున్నవి. లింగ ప్రతిష్ఠాపన దేవగృహాన చేయబడియున్నది.

## భైరవకోన గుహాలయాలు

అత్యధికముగా ఇటుక, కలపలతో నిర్మింపబడుచుండిన నిర్మాణములతోపాటు అశోకుని కాలమందు భారత దేశమున మొట్టమొదట గుహాలయాలు శిలలందు రూపొందించుట ప్రారంభమైనది. అశోకుడు, అతని మనుమడైన దశరథుడు ప్రాంతీయమైన అతికఠినశిల (Quartzose-gneiss) యందు నిర్మించిన తొలి గుహాలయాలు గయ దగ్గర లోని బారాబర్, నాగార్జుని, సితామర్హి పర్వతములందు గలవు. వాటిలో సుదామ, లోమస్ రిషి గుహాలయాలు

ముఖ్యమైనవి. క్రీ. పూ॥ 200 — క్రీ. శ. 200 మధ్యకాలమందు పశ్చిమ దక్కన్‌యందు పూనా, నాసిక్, అజంతా, ఔరంగాబాద్, ఎల్లోరా లందు మెతుపుశిల (softer trap rock) యందు చైత్యగృహాలు, విహారాలు ఏర్పరచబడినవి. ఉత్తర కోస్తా ఆంధ్రయందు, దక్షిణ ఒరిస్సాయందు ఖండగిరి, ఉదయగిరి, గుంటుపల్లి, శంకరం వంటి ప్రాంతాలలో మెతుపుశిల యందు ఇవి నిర్మించబడినవి. గుంటుపల్లి గుహాలయాలు సుదామ, లోమస్ రిషి గుహాలయములను పోలియున్నవి. అజంతా యందలి గుహాలయాలలో ఎనిమిది క్రీ. పూ. 2వ శతాబ్దము మధ్యభాగాన నిర్మింపబడినవి. మిగిలినవి 4వ శతాబ్దము తరువాత నిర్మించబడినవి. ఇవి వాకాటక రాజుల కాలమందు క్రీ. శ. 450 - 650 మధ్యకాలమున నిర్మింపబడినవి. ఈ నిర్మాణాలు రాష్ట్రకూటుల కాలమందు ఎనిమిది, తొమ్మిది శతాబ్దములవరకు కొనసాగినవి. ఎల్లోరా గుహాలయాలు క్రీ శ. 4వ శతాబ్దమునుండి క్రీ. శ. 7వ శతాబ్దము మధ్యకాలమున నిర్మింపబడినవి.

క్రీ. శ. మొదటి మిలీనియంయొక్క రెండవ అర్ధభాగమున హిందు, జైన, బౌద్ధ శిలా గుహాలయాల నిర్మాణము వాతాపి (బాదామి) చాళుక్యులు, వేంగీ చాళుక్యులు, పల్లవులు, పాండ్యులు దక్షిణ భారతదేశమందు రాజ్యాలను స్థాపించుటతో ప్రారంభమైనది. క్రీ. శ. 6వ శతాబ్దము మొదలు 9వ శతాబ్దమువరకు వీరి కాలములందు జరిగిన నిర్మాణాలు ముఖ్యమైనవి. ఈ విధానము 10వ శతాబ్దమువరకు కొనసాగినది. రాజకీయాలందేగాక వాస్తు, శిల్ప, సాహిత్యపోషణలందు కూడ వీరు, ఇతర చిన్న రాజవంశాలవారు పోటీపడుచుండిరి. చాళుక్య రాజైన మంగిశేశ, ఇతని సమకాలికుడు పల్లవ రాజైన ఒకటవ మహేంద్రవర్మలతో గుహాలయాల నిర్మాణము దక్షిణదేశంలో ప్రారంభమైనది. క్రీ. శ. 578లో బాదామియందు మొదట విష్ణుగుహాలయమును మంగళేశ నిర్మించాడు. ఒకటవ మహేంద్రవర్మ మండగపట్టుయందు త్రిమూర్తులకొరకు తన మొదటి గుహాలయము నిర్మించాడు. మంగళేశ మౌర్యుల కాలమునుండి వాడుకలోనున్న మెతుపురాళ్ళయిన sand stone, trop or lime stoneలందు గుహాలయ నిర్మాణములు చేయగా మహేంద్రవర్మ (క్రీ. శ. 580 - 630) కఠినశిల (hard granite rock) లందు నిర్మించినాడు. మహేంద్రవర్మ అశోకుని తరువాత మొదట తన కాలమందు ఇటుక, కలప, లోహములులేని "లక్షితము" లేక దేవగృహము త్రిమూర్తులకు నిర్మించినట్లు చెప్పుకొనియున్నాడు. కావున పల్లవులు కఠినశిలలందు, చాళుక్యులు మెతుపు శిలలందు గుహాలయములు రూపొందించెడి రెండు విధానాలను దక్షిణ దేశమందు ప్రారంభించిరని చెప్పవచ్చును. ఇట్టి శిలా సాంప్రదాయాలు విజయనగర కాలమువరకు కొనసాగినవి.

పల్లవరాజైన మొదటి మహేంద్రవర్మ (క్రీ. శ. 580 - 630) కాలానికి చెందిన గుహాలయాలు ముఖ్యముగా 10 కలవు. వానిలో లక్షిత యాతన (మండగప్పట్టు), పంచపాండవ గుహాలయం (పల్లవరం) మొదలగునవి కలవు.

ఇతని కుమారుడు మొదటి నరసింహవర్మ మామల్ల (క్రీ. శ. 630 - 72), ఒకటవ పరమేశ్వరవర్మ (672 - 700), రాజసింహ లేక రెండవ నరసింహవర్మ (700 - 728) ఇతని నిర్మాణరీతిని కొనసాగించి ఓరగడం మండప (తిరుక్కాల్‌కున్రం), కోటికల్‌మండప (మహాబలిపురం) మొదలగువాటిని వీరు నిర్మించిరి.

మహేంద్రవర్మ కుమారుడైన మొదటి నరసింహవర్మ మామల్ల (630 - 668) మహేంద్ర రీతిలోని గుహాలయములేగాక నూతనముగా తన మామల్లరీతిలోని పరిణతి దశను తెలిపెడి గుహాలయాలను, ఏకశిలారథములను రూపొందించినాడు. ఇవి చాలావరకు మహాబలిపురమందు గలవు.

తూర్పు చాళుక్యులుకూడా మెతుపుశిలయందు కృష్ణకు ఇరువైపులా సుమారు 12 గుహాలయాలను నిర్మించిరి. ఇవి ఉండవల్లి, మొగల్‌రాజపురము, విజయవాడ, పెనమాగ, సీతారామపురములందు గలవు. ఇవి క్రీ. శ. 7 - 8 శతాబ్దములకు చెందినవి.

ఆంధ్రదేశమున శిలాపర్వతములను తొలిచి గుహాలయాలను ఏర్పరచుట మౌర్యుల కాలము నుండి ఆరంభమయ్యెను. పశ్చిమ గోదావరి జిల్లా ఏలూరునకు 25 మైళ్ళ దూరమున నుండు 'గుంటుపల్లి'లోని కొండలను తొలిచి నిర్మించిన చైత్యగృహములను, విహారములను పరిశీలించినచో ఇవి మౌర్యకాలము తరువాతివని తెలియుచున్నది.

మౌర్యవంశానంతరము ధాన్యకటక, ప్రతిష్ఠానపురములు ముఖ్యపట్టణములుగా కలిగి సముద్రతీర ఆంధ్ర దేశమును పరిపాలించిన ఆంధ్ర శాతవాహనులు వైదికమతాన్ని అనుసరించినను ఆనాటి బౌద్ధులకు విహారములు, చైత్యగృహాలు నిర్మించి దానము చేసిరి.

విజయవాడకు తూర్పున గల మొగల్‌రాజపురము, కృష్ణకు దక్షిణతీరమున గల ఉండవల్లి గుహలనుబట్టి ఈ గుహల నిర్మాణము ప్రోత్సహించినవారు శాతవాహనులని యనవచ్చును. తరువాత వచ్చిన ఇక్ష్వాకులు, విష్ణుకుండినులు, శాలంకాయనులు వీటిని ప్రోత్సహించిరి ఇక్ష్వాకుల తుదిదశయందు పల్లవులు తాత్కాలికముగా నెల్లూరు ఉత్తరమునకు వ్యాపించి కొంతకాలము ధాన్యకటకము పాలించిరి

పల్లవరాజగు మహేంద్రవర్మ ధాన్యకటకమందు రాజప్రతినిధిగా యుండగా ఇట్టి గుహాలయ నిర్మాణములను గూర్చి తెలుసుకొని కలప, ఇటుక, లోహనిర్మితములకంటె శాశ్వతమైన వీటి నిర్మాణాలను ఆంధ్రదేశమందు ప్రోత్సహించెను. కొంతకాలమునకు పల్లవులు జయింపబడి దక్షిణదేశమునకు పారద్రోలబడినందున పెన్నవరకు వెనుకకు వచ్చి, పెన్న పరిసర దక్షిణ ప్రాంతములను ఆక్రమించిరి అట్టి ఆక్రమణ కాలమున నిర్మించిన పర్వత గుహాలయాలకు భైరవకొండలోని శిల్పములే తార్కాణమని ప్రొ॥ ఆర్. సుబ్రమణ్యంగారి అభిప్రాయం కాని ఇచ్చటి గుహాలయాలు క్రీ.శ 8వ శతాబ్దమునకు చెందినవిగా కొందరు శాస్త్రవేత్తలు భావించుటవలన మహేంద్రవర్మ క్రీ.శ. 7వ శతాబ్దము వాడు గనుక, ఇవి మహేంద్రవర్మచే నిర్మింపబడినవనెడి డా॥ సుబ్రమణ్యంగారి అభిప్రాయం భేదాభిప్రాయానికి తావిచ్చుచున్నది

భైరవకోన నెల్లూరు జిల్లా, ఉదయగిరి తాలూకాయందు కొత్తపల్లివద్ద కలదు (మాప్ నం. 1, 2 చూడుము). నెల్లూరునుండి, కావలినుండి యిచ్చటకు మార్గములు కలవు. ఇది కావలికి సుమారు 70 మైళ్ళ పశ్చిమాన 'కొత్తపల్లి కొండలలో కలదు. ఇచటి దేవాలయమందు భైరవమూర్తి కన్పించుచుండుటచే ఈ ప్రాంతమునకు భైరవకోన లేక భైరవకొండ యను పేరు వాడుకలోనికి వచ్చినది. ఈ భైరవమూర్తి శిల్పము ఇచటి సెలయేటి తూర్పు ఒడ్డు భాగమున ఒక పెద్ద బండ విభాగమున చెక్కబడియున్నది. ఈ శిల్పము చుట్టూ తరువాతి కాలములో దేవగృహ నిర్మాణము చేయబడినది. దీని చెంతనే కొన్ని చిన్నచిన్న దేవగృహములు (memorial shrines) గలవు వీటిలో దక్షిణ కొసలోని దేవగృహ ద్వారమున కిరువైపులా రెండు చేతుల బ్రహ్మ, నాల్గు చేతుల విష్ణువుల అర్ధశిల్పములు గలవు ద్వారము పై విభాగమున 'రాజపౌరేరి' రాజు కుమార్తెయైన 'గోయింద పౌరేరి' మనుమరాలైన 'లోకమ'చే ఈ చిన్న గుహాలయము రూపొందింపబడినదని తెలుపబడియున్నది. ఈ శాసనము క్రీ.శ. 9వ శతాబ్దమునాటి తెలుగు చోడరాజులకు చెందినదిగా తెలియుచున్నది

భైరవకోనవద్ద గల ఒక కొండపై ఉన్న 'లింగాలదొరువు'నందు ఉద్భవించు గంగ భైరవకోనవద్ద జలపాతముగా మారి దుర్గా భైరవాలయమునకు, గుహాలయములకు మధ్య 'సోనవాన' యను పేరుతో ప్రవహించెడి సెలయేటికి కొంతదూరములో soft schist శిలయందు నిర్మింపబడిన పల్లవ వాస్తు శిల్పశైలి యనబడెడి ఎనిమిది గుహాలయములు గలవు (11 నుండి 22 వరకు గల చిత్రపటాలు చూడుము). మహాబలిపురమున గల గుహల

శిల్పశైలితో ఇవి పోలిక కలిగియున్నవి. కాని గుహలు చాలా చిన్నవి. చెక్కిన సంప్రదాయమూ, పైనించి క్రిందకు సాగినందులనూ, గర్భాలయాల ముందు ప్రాంగణములను నిర్మించినట్లు కానవస్తున్నది. కాని మహాబలి పురములో వలె గళ్ళు కొట్టి నడిమి ముక్కలను చెక్కుతూ సాగినట్లు కానరాదు. ఆ రీతినే అవలంబించియుంటే ఈ గుహలు బాగా లోతుగా ఉండియుండును ఇవన్నీ ఒకే కాలానివిగా అగుపడవు. ఇచటి శిల్పనిర్మాణశైలి క్రీ.శ. 7 వ శతాబ్దము మొదలు క్రీ.శ 8 వ శతాబ్దము ఉత్తరార్ధమువరకు చెందినవై యుండునవి. దక్షిణ భారతదేశ గుహాలయాలలో ప్రాచీనమైనవని లాంగ్ హర్స్ట్ అభిప్రాయపడిరి కాని నూతన పరిశోధనలనుబట్టి ఈ గుహాలయాలు 8 వ శతాబ్దమునకు చెందినవని చెప్పవచ్చునని డా॥ బి. రాజేంద్రప్రసాద్‌గారు ఒక అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. ఇవి రెండు దశలలో నిర్మింపబడినవిగా అగుపడును. మొదటి నాలుగు గుహాలయాలు మొదటి దశకు, మిగిలిన నాలుగు మలిదశకు చెందినవని నిర్మాణరీతినిబట్టి చెప్పవచ్చును. ఒక పెద్ద గుట్టపునాడా ఆకారంలో గల ఏకశిలా గుట్టయొక్క ఏటవాలు ముఖభాగాన ఇవి వరుసగా నిర్మింపబడియున్నవి (చిత్రపటాలు 11 నుండి 22 వరకు చూడుము) మొదటి గుహమాత్రము ఉత్తర ముఖమును, మిగిలినవన్నియు తూర్పు ముఖమును కలిగియున్నవి. ఇది పల్లవ సాంప్రదాయాన్ని తెలియజేస్తుంది. మొదటి నాలుగు చతురస్రాకార గర్భగృహను మాత్రము కలిగి దానిమధ్య శివ లింగము, పానవట్టమును కలిగియున్నవి. ఈ గుహల ముందుభాగాన మండపములు లేవు (33. 35 వ చిత్రపటములు చూడుము). వీటి కపోత సరిగా రూపొందింపబడలేదు మిగిలిన నాలుగు గుహలు చతురస్రాకార గర్భగృహ, మండప, మండపమందు రెండు కుడ్య స్తంభాలను రెండు స్తంభాలను కలిగియున్నవి (34, 35, 22వ చిత్రపటములు చూడుము). ఇవి 'కపోత'ను కలిగియున్నవి. ఈ గుహలన్నింటికి విడివిడిగా గల చిన్న ప్రాంగణములందు ఇరువైపుల గణేశ, చండేశుల అర్ధ శిల్పములున్నవి. స్తంభాలు కొన్ని మూలములందు (base) ఆసీన సింహాలను కలిగియున్నవి. ప్రతి మండపమందు ద్వారపాలకులు, బ్రహ్మ, విష్ణువులు గలరు. ప్రతి గుహాలయము ముందు గల ప్రాంగణము మధ్య నంది ప్రతిమ గలదు. ఇచట చండేశ, గణేశ అర్ధశిల్పాలు పల్లవేతర శిల్పప్రభావాన్ని తెలుపుచున్నవి. ఇచట గుహాలయము లన్నిటియందు శివలింగము గలదు. ఇవన్నియు చాలవరకు ప్రాఙ్ముఖములుగా యున్నవి. ఇందలి శివలింగములు మధ్యమ పరిమాణములై గుండ్రముగా, నున్నగా యున్నవి. ఇవి నల్లరాతితో చేయబడి యున్నవి. ఎచటనుండో తెప్పించి ప్రతిష్ఠింపబడినవి. పానవట్టములు ఇచటి ప్రాంతీయ కొండరాతితోనే మలచ బడినవి. చచ్చౌకముగ యుండి 18 అం॥ ఎత్తు గలవు. గుహాలయాలు 6½ అ॥ పొడవు, 6 అ॥ ఎత్తు కలిగి యున్నవి. ముఖ్య దేవగృహ ప్రవేశమార్గమునకు ఇరువైపులా గల వెలుపలి కుడ్యముపై రెండు చేతులు గల ద్వారపాలక ప్రతిమలు అర్ధశిల్పమున గుహాలయ ఏకశిలయందే మలచబడియున్నవి (చిత్రపటములు 13 నుండి 22 వరకు మరియు 26 నుండి 28 వరకు చూడుము). తాము ధరించిన పెద్ద 'గదల'పై వారు వాలినట్లు అగపడుచున్నారు ఇది పల్లవ సాంప్రదాయము. "వీరి శృంగ యుతోష్ణీషములు, జటాజూట శిలారచన పరిశీలించినచో మహాబలి పురము, తిరుచిరాపల్లి, దలవనూరు, మందగపట్టు మొదలైన ప్రాంతములందలి శిల్పనైపుణ్యమును ప్రదర్శించునవిగ యున్నవి" అని ప్రొ॥ ఆర్. సుబ్రమణ్యంగారు అభిప్రాయపడిరి.

ద్వారపాలకులకు ప్రక్కన బ్రహ్మ, విష్ణువుల ప్రతిమలు అర్ధశిల్పమునందు రూపొందింపబడియుండుట కూడ పల్లవ శిల్పరచనాశైలియే. గుహకు కుడివైపు బ్రహ్మ, ఎడమవైపు విష్ణువుండుటచే ఇవి కొంతవరకు త్రిమూర్తుల దేవాలయములని చెప్పవచ్చును. కాని ఇచట శివునికే ప్రాధాన్య మివ్వబడియున్నది. ఇచటి కుడ్యమందలి మరుగుజ్జులు, ఆసీన సింహముపై పొదిగింపబడియున్న స్తంభములు, వాటిపై అడ్డముగా యుండు శిల్పములును పల్లవశైలికి చెందినవి. ఇచ్చట ప్రాచీన లిపితో వ్రాయబడిన కొన్ని శాసనములు గలవు. లిపి చదువరులు తెలుసు.

కొన్నింతవరకు ఈ గుహల నిర్మాత ఎవరైనది తెలియుటలేదు. కాని స్థపకుల, శిలాచ్ఛిద్రకుల, పర్వతక్షకుల పేర్లును, ఎవరి పేరిట ప్రతిష్ఠ గావింపబడినదియును తెలియుచున్నది. రెండవ గుహయందు క్రిందివిధముగా భావము నిచ్చెడి శాసనమున్నది. కులీనుడగు దామోదరేశ్వరుని గుడియనియు, వైభవోపేతమగు బ్రహ్మేశ్వర నిలయమనియు, దీనిని మలచినది చామాచారి (ధీరుకమతి) అనియు కలదు. ఇచటి అష్టగుహ 'దేవయాతనము'లందు పెక్కు భక్తుల జ్ఞాపక చిహ్నములు గలవు.

*మొదటి గుహాలయము :*

ఈ గుహాలయము ఉత్తర (దిక్కు) ముఖముగా తొలచబడియున్నది (చిత్రపటములు 13, 14 చూడుము). మిగిలినవన్నియు తూర్పు ముఖములు. ఇది ఒక చిన్న గుహాలయము. సుమారు 5½ అ॥ చతురస్రాకారముగా నున్నది. 6 అ॥ ఎత్తుగల గర్భగృహ (shrine cell) ఇందు గలదు ఇందు మెరుపుగల నల్లరాతి శివలింగ మున్నది. గుహ ముందు 11½ అ॥ పొడవు, 5½ వెడల్పు గల ప్రాంగణము (open terrace) కలదు. గర్భగృహ ద్వారమునకు ఇరువైపులా వెలుపలి కుడ్యభాగాన ఛత్రరూపణయందు ద్వారపాలకులు గదలు ధరించిన ప్రతిమలుగా చెక్కబడియున్నారు (చిత్రపటములు 13, 14, 12 చూడుము). వీరు పల్లవరీతిలో గదలమీద వాలినట్లు చెక్కబడి యున్నారు. పశ్చిమ భాగమందలి ద్వారపాలకునకు శృంగయుత శిరోవేష్టనము కలదు. ఇందు శాసనము లేదు. ఇది క్రీ.శ. 7వ శతాబ్ది పూర్వార్ధమునకు చెందినదని కొందరి అభిప్రాయము. క్రీ.శ. 8వ శతాబ్దము మధ్య భాగానికి చెందినదని మరికొందరి అభిప్రాయము.

ఈ గుహాలయ ముఖభాగాన రెండువైపులా కొసలందు ద్వారపాలకుల ప్రక్కగా బ్రహ్మ, విష్ణువుల అర్ధ శిల్పములున్నవి. గుహాలయ ప్రాంగణమున రెండువైపులా గణేశ, చండేశ అర్ధశిల్పములు ఉన్నవి. గుహాలయ 'కపోత' విభాగము సరిగా రూపొందింపబడలేదు. 'కపోత' మొరటుగా తయారయినటువంటి 'కూడు' డిజైన్లలో రూపొందింపబడియున్నది గర్భగృహలోని శివలింగానికి ఎదురుగా వెలుపల ప్రాంగణంలో నంది ప్రతిమ గలదు (చిత్రపటములు 13, 14 33 35 చూడుము).

ఈ గుహాలయమందు శిల్పుల చాతుర్య మగుపడదు. దీనినిబట్టికూడ ఇది ప్రాచీనమైనదని భావించ వచ్చును. సారళ్యాన్నిబట్టి, ద్వారపాలకుని కొమ్ము కిరీటాన్నిబట్టి ఇదే అతి ప్రాచీనమనిపిస్తుంది.

*రెండవ గుహాలయము :*

తొలిదానికి తూర్పుభాగమున కొంత ఎత్తులో సెలయేటి దరిన ఈ గుహాలయము గలదు (చిత్రపటములు 15, 16, 33, 35 చూడుము). మొదటిదాని కాలముననే ఇదికూడ నిర్మింపబడినది. గర్భగుడి 4½ అడుగుల చతురస్రాకారముగా నున్నది ఇందు మొదటి గుహలోని దానికన్నా సన్నటిది, కొంత పొడవైనదైన నల్లరాతి శివలింగమున్నది. ద్వారమున కిరువైపులా ద్వారపాలకులున్నారు (15, 16 చిత్రపటములు చూడుము) కాని వీరికి శృంగయుతోష్ణీషములు (horned headgear) లేవు. ఈ గుహ ముందుభాగాన గల ప్రాంగణము 8 అ॥ చతురస్రముగా యున్నది. ఇచట భక్తులయొక్క, పోషకులయొక్క జ్ఞాపకచిహ్నములు గల శాసనములను లాంగ్ హర్స్ట్ కనుగొనిరి.

శిల్పచాతుర్యమునందు మొదటి గుహకు, దీనికి తేడా ఏమియు లేనట్లు అగుపడుచున్నది. ఇది శిథిలమైన పల్లవరీతి నంది ప్రతిమను ప్రాంగణమునందు కలిగియున్నది. ప్రాంగణమునందు రెండువైపులా చండేశ, గణేశ

అర్ధశిల్పములు చిన్న దేవకోష్ఠములందు గలవు. గుహాలయ కపోత విభాగమున 'కూడు' డిజైన్లు లేవు. ఈ గుహయందు త్రిమూర్తులు లేరు. ఒకటవ గుహకు, రెండవ గుహకు మధ్య చాలా చిన్నతరహా గుహాలయ (memorial shrines) సమూహ మున్నది. వీటిలో చిన్న గర్భగృహ, అందు పానవట్టమున్నది. శివలింగము లేదు. ఈ చిన్న దేవగృహముల క్రిందిభాగమున మరీ చిన్నచిన్న గుహాలయములందు (memorial shrines) చిన్నచిన్న శివలింగములు చెక్కబడియున్నవి. వీటి చెంతనే ఒక చిన్న శాసనము 'ఐశ్వర్య దామోదరేశ్వర దేవ గృహం' అనియు, మరొక శాసనములో 'ధీరుకంతి చామాచారి'చే ఈ ప్రసిద్ధ బ్రహ్మేశ్వర నివాసము నిర్మింపబడిన దనియు వ్రాయబడియున్నది.

*మూడవ గుహాలయము :*

ఇది మునుపటి రెండు గుహలవలె 5 అ॥ చతురస్రముగ నున్నది (16, 33, 35వ చిత్రపటములు చూడుము). ద్వారమున కిరువైపులా ద్వారపాలకులు గలరు. ఉత్తర భాగమందుండు ద్వారపాలకునకు శృంగ యుతోష్ణీషము కలదు. ఈ గుహ ప్రాంగణము 9½ అ॥ పొడవు, 6 అ॥ వెడల్పు గలదు (16వ చిత్రపటము చూడుము). ఇది రెండవ గుహ ప్రాంగణముకంటె పెద్దది. ద్వారపాలకుల చిత్రణలో ఇచట కొంత ఎక్కువ నైపుణ్యము కనబడుచున్నది. దీనికి అర్ధమండపముగాని, ముఖమండపముగాని లేదు. చిన్న ప్రాంగణము మాత్రమే యున్నది. శివలింగమునకు ఎదురుగా (వెలుపల) పశ్చిమ ముఖభాగముగా నంది కలదు. మూడవ గుహాలయము నందు శివలింగము ఆధునిక కాలానికి చెందినది గలదు. ప్రాంగణమునందు ఉత్తర దక్షిణములందు గణేశ, చండేశ అర్ధశిల్పములు గలవు.

ఈ గుహాలయమునకు కపోత విభాగము రూపొందింపబడలేదు. ఇచటి నంది విగ్రహము పల్లవరీతిలో యున్నది. ఈ గుహాలయము క్రిందగా రెండు చిన్న గుహాలయములందు (memorial shrines) చిన్నచిన్న శివలింగములు చెక్కబడియున్నవి.

పై మూడు గుహలను పరీక్షించినచో ఈ మూడును ఒకేరీతిగా చెక్కబడినట్లుగా మనకు తెలియుచున్నది.

*నాలుగవ గుహాలయము :*

ఈ గుహాలయము అసంపూర్తిగా యున్నది. గర్భగుడి 4½ అ॥ చతురస్రాకారము గలిగియున్నది (17, 18, 19, 33, 35వ చిత్రపటములు చూడుము). గర్భగృహ మధ్యయందు పానవట్టమున్నది. పానవట్టము నందు నల్లని రాతితో చేయబడిన మెరుపుగల శివలింగమున్నది. ద్వారపాలకులు పల్లవరీతిలోనే యున్నారు. ఉత్తర వైపున గల ద్వారపాలకునకు శృంగయుతోష్ణీషములు గలవు. ఇచటి ప్రాంగణము అసంపూర్తిగా యున్నది. ఇది 13 అ॥ పొడవు, 4 అ॥ వెడల్పు గలిగియున్నది. ఈ గుహలోని శివలింగమునకు వెనుక గల కుడ్యముయొక్క ముఖభాగమున త్రిముఖయుత శివుని ('మహేశ') అర్ధశిల్పము గలదు (24వ చిత్రపటము చూడుము) ఇతనికి మూడు తలలు గలవు. పల్లవ గుహాలయాలలో సోమస్కంధ చిత్రరూప ముండును. కాని ఇచట వేరు ఇచటి మహేశ ఎల్లోరా ప్రాంతమంతలి క్రీ. శ. 8వ శతాబ్దమునకు చెందిన మహేశ శివునివలె యున్నది (25వ చిత్రపటము చూడుము).

ప్రాంగణమునందు నంది మలచబడిన రూపురేఖలు గలవు. శిల్పము నాశనమై యున్నది. ప్రాంగణమున ఉత్తర దక్షిణ భాగములందు చిన్నచిన్న దేవకోష్ఠములు గలవు. ఈ కోష్ఠములలో ఒకదానియందు 'గణేశ' అర్ధ

శిల్పము గలదు. గుహాలయముయొక్క 'కపోత' క్వార్టర్ సర్కిల్ ఆకారములో మలుచుటకు ప్రయత్నము జరిగియున్నది కాని పూర్తి చేయబడలేదు. 'కూడు' డిజైన్లు లేవు. శాసనములు లేవు.

ఇచ్చటి గుహాలయాలలో మొదటి గుహాలయమునుండి నాలుగవ గుహాలయము వరకు అతిదగ్గరి పోలికలు కనిపించుచున్నవి. కావుననే ఇవన్నీ ఒకే కాలానికి చెందినవని భావించవచ్చును.

*ఐదవ గుహాలయము :*

మొదటి నాలుగు గుహాలయములకన్నను నిర్మాణరీతులలో ఇది చాలా భేదమును కలిగియున్నది (17, 18, 19, 34, 36 వ చిత్రపటములు చూడుము). ఇది మొదటి నాలుగు గుహాలయాలకంటె తరువాతి కాలములో నిర్మింపబడినట్లు తెలియుచున్నది. ఇది క్రీ. శ. 9 వ శతాబ్దమునకు చెందినదని కొందరి అభిప్రాయము. మరికొందరు ఇది క్రీ. శ 8 వ శతాబ్దమునకు చెందినదందురు. ఇది నాలుగవ గుహాలయము పైన కొద్దిగా వెనుకగా నిర్మింపబడియున్నది. ఇందు 6 అ॥ చతురస్రాకార గర్భగృహ, శివలింగము కలదు. ఈ గుహాలయ ద్వారపాలకులు కుశలురగు మేటి స్థపకుల చేత నిర్మింపబడిరని ప్రొ॥ ఆర్. సుబ్రమణ్యంగారి అభిప్రాయము. గర్భగృహ ముందు 15 అ॥ పొడవు, 4½ అ॥ వెడల్పు గల మండపము. అందు రెండు కుడ్యస్తంభాలు. రెండు స్తంభములపై ఏకశిలయందే రూపొందింపబడియున్నది (18, 19, 37 వ చిత్రపటములు చూడుము). స్తంభములకు వెలుపలి ముఖమున నాలుగు చిన్న శాసనములు గలవు. వాటి సారాంశమునుగూర్చి కృష్ణశాస్త్రిగారు ఇట్లు వివరించిరి :

(1) 'శ్రీ త్రిభువనాదిత్యం' (ఇది చాళుక్యరాజుయొక్క బిరుదుగా యుండును.)

(2) 'శ్రీ దెర్లుగుముదం ఆచార్ల పపి కోపిరి' (అనగా ఈ శిల్పనిర్మాణము సుప్రసిద్ధుడగు బెర్లుగుముదం ఆచార్యులని స్పష్టము. బహుశః రెండవ గుహలోని 'ధీరుకంతి' అను పదమే ఇందలి 'దెర్లుగుముద'మై వుండును).

(3) 'దాకేరేమి' (బహుశా దాకేరేమి పదము ద్రాక్షారామ శాసనములందు కన్పించెడివి).

(4) 'శ్రీ నరనరేంద్రుండు' (ప్రఖ్యాత రాజరాజనరుడు, చాళుక్యరాజుగా నుండవచ్చును. ఆ కాలమున కృషియొక్క పునీతత్వము శ్లాఘించబడుచుండెను).

గర్భగృహయందు పానవట్టము ప్రాంతీయమైన శిలతో నిర్మాణము చేయబడియున్నది. ద్వారపాలకుల ప్రక్కన మండపముయొక్క మూలలకు దగ్గరగా కోష్ఠములందు బ్రహ్మ, విష్ణువుల అర్థశిల్పములు గలవు మండపము ముందు విభాగమున రెండు కొనలందు కుడ్యస్తంభాలు, ఆ రెండింటి మధ్యభాగాన రెండు స్తంభములు గలవు. స్తంభముల అంద విభాగమున క్రింద, పైన చతురస్రాకారపు విభాగము గలిగి ఈ రెండింటి మధ్య అష్టకోణ విభాగము అందు తడి, కుంభ విభాగాలు యున్నవి. ఈ స్తంభముల 'కాపిటల్' విభాగమునందు 'కుంభ', 'వీరకంఠ', 'పొటిక' విభాగములు గలవు. (17, 18, 19 వ చిత్రపటములు చూడుము). స్తంభములపైన చిన్న 'దూలము' వంటి విభాగము, దీనిపైన 'కపోత', ఈ రెండింటి మధ్య 'గణమాల' కలదు. కపోత ముఖభాగమున 'కూడు' డిజైనులు కలవు. వీటి పై విభాగమున సింహపు తలలు గలవు. ఈ సింహపు తలలు పల్లవరీతి లోనివి. పశ్చిమ చాళుక్యుల కాలమందు కూడ ఈ రీతి గలదు. 'కపోత'పైన సింహపు జంటల వరుస గలదు. ఇచటి 'కూడు'ల మధ్యభాగమందు మానవ తలలుగల అర్థశిల్పములున్నవి. ఈ గుహ ప్రాంగణము యొక్క ఉత్తర, దక్షిణములందు గణేశ, చండేశ అర్థశిల్పములున్నవి. శివలింగమునకు ఎదురుగా ప్రాంగణాన నంది ప్రతిమ గలదు.

ఈ గుహాలయములోని శిల్పసంపద ముందు చూచిన వాటిలోని శిల్పములకన్న పరిణతి దశను కలిగి యున్నది. నేర్పరులైన శిల్పులు దీనిని నిర్మించినట్లు తోచుచున్నది.

*ఆరవ గుహాలయము :*

ఐదవదానివలెనే ఈ గుహాలయము 5 అ॥ చతురస్రాకారమును గలిగియున్నది. (20, 34, 36 వ చిత్రపటములు చూడుము) ఇందును శివలింగము, పానవట్టము గలవు. శివలింగము నల్లరాతితో చేయబడి మెరుపును గలిగియున్నది. ద్వారపాలకులు 5 వ గుహలో నున్నట్లే యున్నారు. వీరి ప్రక్కలలో బ్రహ్మ, విష్ణు అర్ధశిల్పాలు ఉన్నవి (26, 27, 28 వ చిత్రపటములు చూడుము). ఉత్తరవైపునున్న ద్వారపాలకునకు శృంగముతో కూడిన తలపాగ గలదు. ఈ గుహాలయము ముందు 12½ అ॥ పొడవు, 3½ అ॥ వెడల్పు గల ప్రాంగణము చెక్కబడి యున్నది. దీని ఉత్తరవైపున గల భిత్తికపై శివ ప్రతిమ చిన్నదిగా మలచబడియున్నది దాని చెంత శిలాక్షరములు గలవు. మండపము ముఖభాగమున రెండువైపులా కొనలందు కుడ్య స్తంభాలు గలవు. ఈ రెండింటి మధ్య రెండు స్తంభములున్నవి. ఇవి 'అండము' మధ్యభాగాన అష్టాగనల్ విభాగమును కలిగియున్నవి. 'కాపిటల్' విభాగమున శిల్పములు గలవు. వీటి 'కార్బెల్' సాధారణ వంపు (simple corbel) గలిగియున్నవి. 'తరంగ' లేక 'తరంగ పట్టా' రూపురేఖలు లేవు (20 వ చిత్రపటమును చూడుము). స్తంభములకు, కుడ్యస్తంభాలకు పైన గల దూలము వంటి విభాగములో 'గణహారము' గలదు. ఈ దూలము పైన 'కపోత' క్వార్టర్ సర్కిల్ నిర్మాణములో గలదు. దీని ముఖభాగాన కూడు డిజైన్ల వరుస గలదు. ప్రాంగణాన కుడి, ఎడమల రెండువైపులా గణేశ, చండేశ అర్ధశిల్పములు ఉన్నవి ఈ గుహాలయములోని శిల్పసంపద కూడ ఐదవ గుహాలయములోవలె పరిణతి దశకు చెందినదిగా ఉన్నది. ఇచట నంది లేదు.

*ఏడవ గుహాలయము :*

ఇచ్చటి గుహలన్నింటిలోను. తొలి నాల్గింటికంటెను తరువాతిదై సుందరమగు శిల్పనైపుణి గలిగి మహాబలిపుర శిల్పసౌందర్యమును ఇది స్ఫురింపజేయుచున్నది. ఆరవదానివలెనే 5½ అ॥ చతురస్రముగ, సలింగముగ మలచబడి ఉన్నది (21, 22, 34, 36 వ చిత్రపటములు చూడుము). ద్వారమున కిరువైపులా పెద్ద ద్వారపాలకుల శిల్పములు గలవు (26, 27, 28 వ చిత్రపటములు చూడుము). ఉత్తర వైపున గల ద్వారపాలకుడు 'శృంగము'. 'పాగా' ధరించియున్నాడు. ఆకారములో మానవ పరిమాణములో గలవు. దక్షిణవైపున ఉన్న ద్వారపాలకునకు అణగినట్లుండు 'తలపాగా', కుటిల జడలును గలవు. ప్రాంగణము చెక్కుచెదరక యున్నది. ముందుండు మండపము సుమారు 15 అ॥ పొడవు, 5 అ॥ వెడల్పు కలిగి యున్నది. దీనిని మోయు రెండు స్తంభముల మూలములలో (base) 'ఆసీన' సింహాకృతులున్నవి (22 వ చిత్రపటము చూడుము). స్తంభములమీద మూడు చిన్న శాసనములు గలవు. రెంటిలో శ్రీశైలముని, అనంతజ్యోతి అను పరివ్రాజకుల నామములున్నవి. మూడవదానిలో 'శ్రీ కరువది ఆచార్ల కోసిన పనియు' అని యున్నది. అనగా ప్రఖ్యాతుడగు కరువది ఆచార్యునిచే ఈ దేవగృహమంతయు మలచ బడినట్లు తెలియుచున్నది.

మండపము మూలలకు దగ్గరగా ద్వారపాలకుల ప్రక్కన బ్రహ్మ, విష్ణువుల అర్ధశిల్పములున్నవి (26, 27, 28 చిత్రపటములు చూడుము). ఈ రెంటికీ కొంత ఎత్తైన పీఠములు కలవు. మండపము ముందు విభాగమునందు ఉత్తర దక్షిణ కొనలలో రెండు కుడ్యస్తంభాలు గోడలో ఇమిడియున్నవి. మండప ముఖభాగాన కుడ్యస్తంభాలకు మధ్య

రెండు స్తంభములు గలవు (22వ చిత్రపటం చూడుము). వీటిని 'చిత్రకంఠ' స్తంభములందురు. ఈ స్తంభ 'మూలము'లందు ఆసీన సింహాలు గలవు. ఈ సింహములపైన ఒక చతురస్రాకార కళానిర్మితమైన స్తంభ 'అండ' విభాగము కలదు. స్తంభము యొక్క 'కాపిటల్' విభాగము 'జేకిభైరవ' మరియు 'కుంభ', 'వీరకంఠ', 'పొటిక' విభాగములు కలవు (22, 31వ చిత్రపటాలు చూడుము). వీటి 'కార్బెల్స్' సాధారణ వంపు గలిగియున్నవి. స్తంభాలపైన 'గణమాల'తో కూడిన 'దూలము' వంటి విభాగము కలదు. దీనిపైన 'కపోత' నిర్మాణము కలదు. కపోత ముఖభాగములందు పడగ గల నాగప్రతిమలు లేక మానవ తలలు మధ్యగల 'కూడు' డిజైన్లు గలవు ఈ డిజైన్ల పైవిభాగాన సింహపు (వ్యాళ) తలలు గలవు. ఇది పశ్చిమ చాళుక్య శిల్పరీతిని చూపుచున్నది. ఈ గుహాలయ ప్రాంగణము నందు ఉత్తర, దక్షిణములలోని చిన్న కోష్ఠములందు గణేశ, చండేశ అర్ధశిల్పములు గలవు. శివలింగ మున కెదురుగా ప్రాంగణాన నంది కలదు.

ఈ గుహాలయము పల్లవ, పశ్చిమ చాళుక్య, రేనాటి చోడుల శిల్పరీతి ప్రభావము కలిగియున్నది. ఈ విషయము కూడులపైనున్న పశ్చిమ చాళుక్యుల సింహపు తలలు, స్తంభముల మూలముల విభాగాన గల ఆసీన సింహములు తెలుపుచున్నవి. అంతేగాక ఇందలి సింహములు ప్రాంతీయ శిల్పరీతి ప్రభావమును కలిగియుండుట గమనార్హము. ఈ విషయము శిల్పములోని ముందుభాగ రూపణనుబట్టి తెలియుచున్నదని డా॥ బి. రాజేంద్రప్రసాద్ గారి అభిప్రాయము. ఈ గుహ 'కపోత' పైన సింహముల జంటల వరుస గలదు. ఈ గుహ ఆరవ గుహకు పైన ఉన్నది

*ఎనిమిదవ గుహాలయము :*

ఈ గుహాలయము ఏడవదాని ప్రక్కనే వున్నది (21, 34, 36వ చిత్రపటములు చూడుము). శిల్పశైలి యంతయు ఏడవదానిని పోలియున్నది. గర్భగుడి 5 అ॥ చతురస్రాకారముగా యున్నది. ద్వారపాలకులు ఏడవ గుహయందువలె వున్నారు. ప్రాంగణము 12 అ॥ పొడవు, 4 అ॥ వెడల్పు కలిగియున్నది శాసనము కనిపించదు. అయినను ఏడవ గుహ కాలమందే నిర్మింపబడినట్లు చెప్పవచ్చును. ప్రాచీన పల్లవ శిల్పమును పోలియున్నది. ఏడు, ఎనిమిది గుహలు పరిమాణములో కొంత తేడా తప్ప మిగిలిన అన్ని అంశాలలో ఒకేరీతిలో యున్నవి.

ఒకే దేవాలయమందు త్రిమూర్తులను ఆరాధించుటకు వీలు కలిగించుట ఇచట గుర్తింపతగినది.

*శిల్పాలు :*

నాలుగవ గుహకెదురుగాకూడా కొంతదూరములో సెలయేటి తూర్పు ఒడ్డున పశ్చిమ ముఖముగా ఒక చిన్న దేవగృహము కలదు. ఇందు శివలింగము ప్రతిష్ఠింపబడియున్నది. గృహమున కిరువైపులా బ్రహ్మ, విష్ణువుల అర్ధశిల్పములు కోష్ఠములందు గలవు. మూడవ గుహకు ఎదురుగా సెలయేటికి అవతలి ఒడ్డున గల శిలాఖండముపై హరిహర, నటరాజ శిల్పములు గలవు.

*ఉపసంహారము :*

భైరవకోన గుహాలయాలు పల్లవ, పశ్చిమ చాళుక్య, రేనాటి చోడుల వాస్తు, శిల్పరీతుల సమ్మిళితమును కలిగియున్నవని చెప్పవచ్చును. ఈ గుహలలోని heavy figures, flat modelling, revealing linearism, high curved ends of the shoulders, rigid frontality ప్రాంతీయ కళాప్రభావాన్ని తెలుపుచున్నవి. కడప

ప్రాంతపు రేనాటి చోడులు ప్రాంతీయ రాజవంశంగా నెల్లూరు ప్రాంతాలనుకూడ కొంతకాలము పాలించారు. సింహపాద స్తంభములు, బ్రహ్మ, విష్ణు, ద్వారపాలకుల అర్ధశిల్పములు, శిల్పములందు గల schematic emphasis, అభయముద్రరూపణ, శంఖు చక్రముల రూపణ, ఎత్తైన కిరీటము, కొమ్ములుగల ద్వారపాలకులు, వారి దృష్టివంటివి పల్లవరీతిని (mannerism) తెలుపుచున్నవి. నాసిక లేక కూడుల పైభాగాన గల కీర్తిముఖతలలు (సింహతలలు) 'చిత్రఖండ' స్తంభాలు, 'భేకిభైరవ' శిల్పరూపము, ఏకశిలా నందివంటివి పశ్చిమ చాళుక్యుల వాస్తుశిల్పరీతి ప్రభావాన్ని తెలుపుచున్నవి. భైరవకోన గుహాలయములు రేనాటి చోడులవై (కడప) యుండవచ్చునవికూడ ఒక అభిప్రాయాన్ని కె. ఆర్. శ్రీనివాసన్‌గారు తెలిపారు. డా॥ రాజేంద్రప్రసాద్‌గారు ఇచటి మొదటి రెండు గుహాలయాలు నిర్మాణ రీతినిబట్టి క్రీ. శ 8వ శతాబ్దము మొదటి అర్ధభాగ కాలానికి చెందినవనియు, మిగిలినవన్ని క్రీ. శ 750 - 850 మధ్య కాలానికి చెందినవనియు అభిప్రాయపడినారు.

Dr. B. Rajendra Prasad says:

"The date of this Rock-cut Temples can be fixed with the help of Inscriptions. The Inscriptional label recording 'Brahmiswara Vishnu' found between tempies 1 and 2 in Pallava grantha characters is ascribed to 8th century. Another inscription on the Southern end near temple 8, records that Lokama, the daughter of a Prince Rajaporeri and grand daughter of Govindaporari caused the erection of the shrine. This is dated to 9th century A. D. The stylistic analysis of the temples suggest that the cave temples No. 1 and 2, belong to the first half of 8th century A. D., while the rest of the shrine have been excavated during 700 to 850 A. D."

కాని ప్రొ॥ ఆర్. సుబ్రమణ్యంగ్గారు ఇచటి గుహాలయాలు పల్లవరాజైన మొదటి మహేంద్రవర్మ కాలమున క్రీ. శ. 7వ శతాబ్దమున ఆ రాజుచే నిర్మింపబడినవని, కాని రెండు దశలలో నిర్మింపబడినవని, కావున భైరవకోన గుహాలయాలు క్రీ. శ. 7వ శతాబ్దము మొదటి అర్ధభాగము నుండి క్రీ శ. 8వ ఉత్తరార్ధమునకు మునుపే రూపొందించబడినవని అభిప్రాయపడిరి. ఇదే అభిప్రాయమును మరుపూరు కొదండరామరెడ్డిగారు వెలిబుచ్చిరి. భైరవకోన గుహాలయాల నిర్మాణము ఉపసీక భోధిశ్రీ (238) అను బౌద్ధ భిక్షువుని కాలములో జరిగినదని శ్రీ సిరిపురం చంద్రహాస్‌గారు తెలిపిరి ఆర్. సుబ్బారెడ్డిగారు ఇవి తూర్పు చాళుక్య రాజైన కుబ్జ విష్ణువర్ధనుని కాలమునకు చెందినవై యుండవచ్చునని తెలియజేసిరి. దీనికి కారణం నెల్లూరు తూర్పు చాళుక్యుల పాలనలో యుండగా పల్లవరాజైన మహేంద్రవర్మ ఆతని తరువాతి రాజులు చాళుక్యులతో పోరాడి నెల్లూరును ఆక్రమించి కొంతకాలము మాత్రమే పరిపాలించిరని, కావున ఈ గుహాలయాలు తూర్పు చాళుక్యుల కాలానివే యని భావించినారు కాని మహేంద్రవర్మ ఆంధ్రలో ఆనాటికే నిర్మించబడియున్న గుహాలయములను చూసి తన రాజ్యమున మహాబలిపురము, మొదలగు ప్రాంతములందు గుహాలయములు నిర్మించెనని వీరి అభిప్రాయము.

భైరవకోన గుహలలో "త్రిభువనాదిత్యం" అంటూ చాళుక్య రాజుల పేర్లు మాత్రమే కాక, చాళుక్య శిల్పగుణాలు చాలా కనపడుతున్నాయి. ఇక్కడి గర్భాలయాలలోని లింగములమీద బ్రహ్మసూత్రాలు భేదముతో కనపడుచున్నవి. అన్నీ ఒకేలాగు లేవు. రెండు నిలువు గీతల నడిమి గీత ఇక్కడి వింత. పల్లవులెరిగిన ధారా (దోరియాల) లింగము ఇక్కడ లేనేలేదు "శివలింగమునకు భస్మత్రిపుండ్రములు నడ్డముగా నుండక, మధ్య నొక చుక్కయు నడుమ మూడు నిలువు గీతలు, వాటికిరువైపులా నర్ధచంద్రాకారముగా రెండు గీతలుండుట మరెచ్చటను కానపడవు".

పల్లవ గుహాలయాలలోని దేవతా విగ్రహాలకు తలచుట్టూ ప్రభామండలాలు కానరావు. చాళుక్యుల దేవతా విగ్రహాలకు ఉంటాయి. అవి ఇక్కడ హరిహరనాథునికీ, ద్వారపాలకుల ప్రక్కనున్న అర్థశిల్ప విగ్రహాలకీ ఉన్నాయి (12, 23, 26, 27, 28 వ చిత్రపటములు చూడుము). హరిహరనాథుడు చాళుక్య త్రిశూలము పట్టుకొనియున్నాడు. బాదామి హరిహరునివలె గోడ కంటుకు పోయినాడు. నటరాజుకిక్కీ ఎనిమిది చేతులున్నాయి. (12, 23 వ చిత్రపటములు చూడుము). పల్లవ విగ్రహాలకు నాలుగు మించి సామాన్యంగా ఉండవు. నటరాజు వస్త్రానికి చాళుక్య శిల్పంలో లాగా గీరలున్నాయి. ఏడవ గుహ స్తంభాల హారాల అలంకారమూ, గూళ్ళ అజంతా వాతాయనపు పోలికలూ, పరశు రాముని పట్టదక్కల్, విరూపాక్ష శివుని జటాభరమూ, ద్వారపాలుర పృష్ఠ స్వస్తికా విన్యాసపు జ్ఞాపకమూ ఈ గుహా లయాల చాళుక్య సాంప్రదాయాల్ని నిరూపిస్తాయి. ఇక్కడి పానవట్టాలు పశ్చిమ చాళుక్య ఆలయాలలో ఉన్నట్లే చతురస్రాలు, వాటి ముక్కులు సన్ననివి. ఈ గుహలు రాజుల నిర్మాణాలుగా అగుపడక తపస్సుల గౌరవార్థము శిల్పులు మలచినట్టివై యుంటాయనిపిస్తుంది (వీటి మొత్తపు చేరికలో సౌందర్యము తోపించడము చూస్తే) కనుకనే ఇంత చిన్నవిగా ఉన్నవి. అయితే ఇవి దేవాలయాలు మాత్రమౌను వీటిలోని శిల్పముల ఏర్పాటు చూస్తే ఇవి కట్టుడు ఆలయాల్ని చొక్కా తిరగవేసినట్టు తిరగవేసి కట్టుడు ఆలయాలకు వెలిప్రక్క అమర్చే విగ్రహాల్ని వీటిలో లోవైపు అమర్చినారా అనిపిస్తుంది. పల్లవుల ఆలయాల పార్శ్వాలలోనూ, చోళ, చాళుక్య ఆలయాలలోనూ దేవతా విగ్రహాలుంటాయి. బిక్కవోలులోని చాళుక్య ఆలయాని కొకదానికి ఉత్తరాన మహిషమర్దనీ, పశ్చిమాన సూర్యుడూ, దక్షిణాన నటరాజూ ఉన్నారు. చోళ ఆలయాలలో అర్ధనారి, బ్రహ్మ, దక్షిణామూర్తి కలరు. ఇక్కడ పార్శ్వాలలో బ్రహ్మ, విష్ణువులు ద్వారపాలకుల ప్రక్కకి వచ్చారు. వేరు గూళ్ళలో ఉన్నారు.

# భైరవకోన శిల్పసంపద

*భైరవుడు :*

భైరవకోనయందు హరిహర నటరాజులున్న బండమీదనే భైరవుణ్ణి నిలిపియున్నారు (12, 32 వ చిత్ర పటములు చూడుము). ఇచటి భైరవ శిల్పము ఎక్కువ ప్రాచీనమైనదికాదు. విజయనగర కాలము నాటిది. భైరవుని చుట్టూ నిర్మింపబడిన ఆలయము ప్రాగుటూరు ప్రాంతపు 'గూర్జర'. 'ప్రతీహారుల' ఆలయాల పోలికతో వున్నది ఈ భైరవుణ్ణిబట్టి ఈ కొండనూ, కోననూ భైరవుని పేరుమీదనే వ్యవహరిస్తున్నారు. శివుడు భైరవస్వామి రూప మున సర్వసాధారణముగా ఉగ్ర లేక ఘోర రూపమును కలిగియుండును. కానీ ఈ రూపపు శివుని ఘనతలకు చెందిన ఎట్టి కథలు ఉండవు. విరూపాక్ష, వీరభద్ర, అఘోర, రుద్రపాశుపతి మొదలగునవికూడా ఈ తెగకు చెందినవే. ఆగమములు 64 భైరవులగూర్చి తెలుపుచున్నవి. వీరు ఎనమండ్రు లెక్కన ఎనమండ్రు కూటములుగా విభజింపబడిరి. ఒక్కొక్క కూటమి నాయకులు వరుసగా అసితంగ, రుద్రచండ, క్రోధ, ఉన్మత్తభైరవ, కపాల, భీషాణ, సంహారలు : ఉత్తర, దక్షిణ భారతదేశమున సాధారణముగా బటుక (వటుక) భైరవ లేక యువభైరవుడు. రూపమండన గ్రంథము వటుక భైరవుడు ఎనిమిది చేతులను కలిగియుండును. ఒక చేయి అభయ హస్తముగను, మిగిలినవి ఖట్వాంగ, పాశ, శూల, డమరు, కపాల, సర్పము, మాంసపు ముక్కలను కలిగియుండునని తెలుపు చున్నది (కట్వాంగం మాంసపాశం చ శూలం చ తథతం కరౌ / డమరు చ కపాలం చ వరదం భుజంగం తథ). భైరవునికి ఒకవైపున శునకము వుండవలెను. వటుక భైరవకల్ప గ్రంథమున భైరవుడు త్రినేత్రములను, ఎర్రటి

శరీరాన్ని (రక్తవిగ్రహం) కలిగియుండవలెనని చెప్పబడియున్నది. నాలుగు చేతులు కలిగి వాటిలో శూలము, పాశము, డమరు, కపాలము లుండవలెను. శునకవాహనుడై వుండవలెను నిరంబరుడుగా పిశాచములు, గణాలు చుట్టుముట్టబడి యుండవలెను. ఒక అద్భుత భైరవశిల్పము నెల్లూరు జిల్లా, వాకాడు తాలూకా, మల్లాం గ్రామంలోని సుబ్రమణ్యేశ్వర స్వామి దేవాలయ కళ్యాణమండపమున కూడా గలదు. మల్లాంలోని భైరవుడు యువకుడుగా అభంగమున నిలచి, నిరంబరుడుగా వున్నాడు. నాలుగు చేతులు గలవు. కుడిచేతులలో డమరు, త్రిశూలములు. ఎడమ చేతులలో పాశము, కపాలములు గలవు. త్రినేత్రములు గలవు. శిరస్సు జటామకుట భూషణముతో వున్నది. ఇతడు చక్ర కుండలములు, గ్రైవేయకలు, యజ్ఞోపవీతము, ఉదరబంధ, నాగకటి సూత, కడియాలు, కంకణాలు గంటల దండ లను కలిగియున్నాడు. ప్రక్క దంతములు, రౌద్రాకారము కలిగియున్నాడు. ఇతని వెనుక కొంత కుడివైపుగా ఒక శునకము గలదు. ఇది చాలవరకు "వటుకభైరవకల్ప" మందు చెప్పబడినట్లు చెక్కబడియున్నది. అనేక చోళ, విజయనగర భైరవ శిల్పాలు మనకు దక్షిణదేశమున అగుపడును. పటిసం, ఆండనల్లూర్, హయంలలోను, శ్రీకాళహస్తిలో కాళహస్తీశ్వర, కాశీ విశ్వేశ్వర దేవాలయాలలోను, విజయనగర శిల్పకళకు చెందిన తాడిపత్రి, శ్రీశైలం ప్రాంతాలలోని శిల్పాలలోను ఇట్టివే మన కగుపడును.

While writing about Bhairavamurti T. N. Srinivasan says: "Siva as the protector of the world is represented as a very fierce image with protruding eyes, and there will be long curved teeth in the mouth protruding out from the upper lip. He will be represented with strange ornaments like garlands of snakes and skulls and even in the head-dress skulls will be shown. There are as many as sixty four types of Bhairava Murtis, most of them having ghastly appearances.

Bhairava is worshipped in many Siva temples outside the main shrine but he is an important deity with village communities for whom small shrines are dedicated in the localities where they live."

శ్రీనాధ మహాకవి తన క్రీడాభిరామ కావ్యమున (వీధి రూపకమున) తిప్పయ వల్లభుడు తనకు మూడు గ్రామములు సర్వభోగములుగా ఇచ్చి 'ములికినాటి' లోని 'మోపూరి'ని పాలించుచుండెనని వర్ణించినాడు. మోపూరు నెల్లూరు మండలములోని ఉదయగిరి సీమలోని దనుట జగద్విదితము. అక్కడనే భైరవాలయమున్నది తిప్పయ వల్లభుడా భైరవస్వామి భక్తుడట. పూర్వము భైరవునికి తిరునాళ్ళు వైభవముగా జరిగెడిదనియు, ప్రజలు తండోప తండాలుగా జేరెడువారనియు, అందు జనుల యానందమునకై ప్రాయికముగా నాటకము లాడబడెడివనియు అట్టి వాటిలో క్రీడాభిరామ మొక్కటనియు దెలియుచున్నది. ఆ కావ్యమున భైరవస్వామి ఇట్లు వర్ణింపబడినాడు.

సీ॥ చంద్ర ఖండములతో సరి వచ్చుననవచ్చు విమల దంష్ట్రా ప్రరోహముల వాని/
భవదంపుఁ గొనలతోఁ బ్రతివచ్చుననవచ్చు కుటిల కోమల జటాచ్ఛటల వాని/
నింద్రనీలములతో నెనవచ్చుననచ్చు కమనీయతర దేహకాంతి వాని/
నుడురాజు రుచులతో నొఱవచ్చుననవచ్చు చంచన్మదాట్టహాసముల వాని॥

గీ॥ సిగ్గుమాలిన మొలవాని జఱుతవాని
నెల్లకాలంబు ములికినాడేలు వాని
వర్ధి మోపూర నవతారమైన వాని
భైరవునిఁ గొల్వ వచ్చిరి భక్తులెల్ల (పీఠిక)

క॥ నటులది దోరసముద్రము
విటులది యొర్గల్లు కవిటి వినుకొండ, మహా
పుట భేదన మీ త్రితయము
విటఁ గూర్చెను బ్రహ్మ రసికులెల్లరు మెచ్చన్॥ (పుట 98)

దీని నాటక కర్త వినుకొండవాడని, నటులు బళ్ళాల రాజుల రాజధానియగు దోరసముద్రము (ద్వారసముద్రము) వారని ప్రదర్శన స్థానము భైరవకోన యని తెలియుచున్నది

*హరిహరుడు :*

భైరవకోనలోని మూడవ గుహకు ఎదురుగా సెలయేటికి అవతలి ఒడ్డున పశ్చిమ ముఖముగా హరిహర, నటరాజ అర్ధశిల్పములు గలవు (23. 12వ చిత్రపటములు చూడుము). ఇవి క్రీ. శ. 9వ శతాబ్దమునందు చెక్కబడినవిగా తెలియుచున్నది. హరిహరుని ప్రతిమ ఆనాటికే ప్రజ్వరిల్లియున్న మత ఉద్యమముల ప్రభావమును తెలుపుచున్నది. క్రీ. శ. 400-600 మధ్యకాలమున నయనార్లు శైవమత వ్యాప్తికి, క్రీ. శ. 5-6 శతాబ్దముల మధ్య ఆళ్వారులు వైష్ణవ మత వ్యాప్తికి భక్తి ప్రధాన సంకీర్తనలతో దేశమందు తిరిగి ప్రజలకు అర్థమగు భాషలో బోధించి మతప్రచారము చేయసాగిరి పల్లవుల కాలము నాటికి ఈ భక్తితత్వం ప్రధాన స్థానంలో యుండి అన్ని మతముల ప్రబోధమునకు సమాన అవకాశములు గల్పింపబడెను. ఈ అన్ని మతముల లేక మత తెగల సమానత్వ భావమే మనకు భైరవకోనయందలి హరిహరుని శిలారూప రచన యందు అగుపడును. ఇచట హరిహర, నటరాజులు ఎనిమిది చేతులు కలిగి, ఆయుధములు ధరించియున్నారు. ఇవికూడ పల్లవుల కాలమునకు చెందినవని ఒక అభిప్రాయము గలదు. వీరిద్దరు కర్ణకుండలములను ధరించియున్నారు. హరిహరుడు ఎత్తైన పల్లవరీతిలోని 'ఉష్ణిషను' కలిగియున్నాడు హరిహరనాథ విగ్రహములు మహాబలిపురమందు, గంగైకొండ చోళపురములందు కూడ కలవు. భైరవకోనలోని హరిహరుడు స్థానక ఆసనములో యున్నాడు. కుడివైపు నాలుగుచేతులలో ఒకటి అభయముద్రలో యున్నది. మిగిలిన మూడింటిలో ఖడ్గము, అక్షమాల, పరశులు గలవు. ఎడమవైపు గల నాలుగు చేతులలో ఒకటి కాట్యవలంబిత లేక కటి హస్త ముద్రలో యున్నది. మిగిలిన మూడింటిలో శంఖు చక్రములు కలవు. శిరస్సుపై కరండమకుటమును కలిగియున్నాడు. యజ్ఞోపవీతమును ధరించియున్నాడు. ఉదరము వరకు వస్త్రము ధరించియున్నాడు. ప్రభామండలము గలదు.

క్రీ. శ. 13వ శతాబ్దమువాడైన తిక్కన హరిహరనాథ సంబోధనలను పర్యాలోచించినచో కూడ శివకేశవ లక్షణ లక్షితమైన హరిహరమూర్తి విశేషము తెలియును. తిక్కనకు ముందే ఆళ్వారులు హరిహర స్వరూపములు రెండును ఒకటిగనే తెలిపిరి. దీనినే తిక్కన విపులముగా ప్రచారము చేసెను రామానుజులు వైష్ణవ మతమును, బసవేశ్వరుడు శైవమును ప్రచారము చేసిరి. శైవ, వైష్ణవ భేదములు సంఘమున మత విషయికమైన అనైక్యము వేరు తన్నుకొనబోవుచున్న కాలమున "ఆంధ్రావళి మోదముం బొరయు" నొక మహాశయమైన కార్యమును నిర్వహించుటకు నవతరించిన "కారణజన్ముడు" తిక్కన. శివకేశవ భేదమును తిక్కన నిరసించెను. ఇతనిది భేదము లేని భక్తి. కావుననే మహాభారతమును హరిహనాథునకు అంకిత మిచ్చెను. హరిహరనాథు నుద్దేశించి శ్రీ మహాభారతమున తిక్కన 193 పద్యములు వ్రాసినాడు. తిక్కన అద్వైత వేదాంతమునందు నిష్ఠ కలిగియుండి జీర్ణించుకొనియుండినాడు. తిక్కన కాలము శైవ, వైష్ణవ మతములకు స్పర్ధయు, తత్తన్మతావలంబులలో పరస్పర విద్వేషమును ప్రబలి, సంఘము విచ్ఛిన్నమగు లక్షణములు అంతంత కధికము కాసాగినవి. అప్పుడు కవిబ్రహ్మ అది

శ్రేయోమార్గము కాదని గమనించి, శివకేశవా భేదరూప ధర్మాద్వైతమును నెలకొల్పి, ప్రజాళికమునకు ప్రబోధ మొసగ సంకల్పించినాడు. తాను హరిహరనాథ రూప పరతత్త్వమును భావనచేసి, అద్వైతానుసంధానమున నారాధించి లోకమునకు ఉత్తమ మార్గదర్శియైనాడు.

తిక్కన కాలమునకు ముందే హరిహరనాథ విగ్రహము - తదర్చన బాదామి, హరిహర పట్టణము (కర్ణాటక రాష్ట్రం), భైరవకోనలోను హరిహరుల ఏకరూపమైన విగ్రహము ఉన్నట్లు, 13 వ శతాబ్దమునకు ముందు కాలమునకే చెందినట్లు తెలియుచున్నది. కాని హరిహరనాథుని నామరూపములు తిక్కనవలన ప్రచారము జరిగినదని చెప్పవచ్చును. నాచనసోముడు, వేంకటనాధుడు, గోపరాజు, కంభంపాటి నారపామాత్యుడు తిక్కన పద్ధతిని అనుసరించి శివకేశవ లక్షణ లక్షితునిగా వర్ణించి ఆతనికి తమ కృతులను అంకితమిచ్చిరి.

హరిహరుడు, నటరాజులు ఆలయాలకొరకు కాక శిల్పులు సరదాకు భైరవకోనలోని 3 వ గుహాలయము ఎదుట ఉన్న బండలో చెక్కినట్లున్నది (12, 23 వ చిత్రపటములు చూడుము).

T. N. Sreenivasan writes about Hariharamurthi (Sankranarayana) thus: "This is also a combination image of Siva and Vishnu, as described in the Vamana Purana. As in case of Ardhanareesvaramurthi, the two halves have characteristics of Vishnu and Siva. Usually the image has four arms carrying Chakra on one side and Mazhu on the other side. The lower arms are in abhaya and varada poses. The famous temple at Sankaranarayana-koil is dedicated to this form of Siva and so also that at Harihar in Mysore". కాని భైరవకోనలోని హరిహరుడు ఎనిమిది చేతులను కలిగి వాటియందు ఆయుధములను కలిగియున్నాడు (12, 23 వ చిత్రపటములు చూడుము).

*నటరాజు :*

భైరవకోనలోని మూడవ గుహాలయానికి ఎదురుగా సెలయేటికి ఆవతల ఒడ్డున పశ్చిమ ముఖముగా హరిహరుని ప్రక్కనే నటరాజ అర్ధశిల్పము గలదు (12, 23 వ చిత్రపటములు చూడుము). నటరాజుకూడ హరిహరుని వలె కర్ణకుండలములను ధరించి ఎనిమిది చేతులను కలిగి అందు ఆయుధములను ధరించియున్నాడు. నటరాజు వస్త్రానికి గీరలున్నవి. కుడివైపు గల నాలుగు హస్తాలలో ఒకటి అభయముద్రలోయున్నది. మిగిలిన మూడింటిలో డమరు, శూలము, ఖట్వంగములను కలిగియున్నాడు. ఎడమవైపు హస్తాలలో ఒకటి గజహస్తముద్రలో యున్నది మిగిలినవి పాశ మొదలైన ఆయుధములను కలిగియున్నవి. శిరస్సుపై కిరీట మకుటం గలదు. నడుముచుట్టూ సర్పము గలిగి ఎడమవైపుకు నటరాజు నడ్డి వంచియున్నాడు

శివప్రతిమలను వాటి "గుణము"ల బట్టి స్థానక, ఆసన విభాగాలుగా చేయవచ్చును. శివునికి సంబంధించి శయన రూపములు లేవు. శివుని రూపాలను శాంతమూర్తులు, అనుగ్రహమూర్తులు, సంహారమూర్తులు, ఉగ్ర మూర్తులు, నృత్యమూర్తులు అను ఐదు విభాగాలుగా చేయవచ్చును. వీటిలో నృత్యమూర్తులు నృత్యరూపాలను కలిగియుండగా మిగిలిన మూర్తులందరూ స్థానక లేక ఆసన రూపమున వుందును.

శివునిగూర్చిన అధ్యయనంలో నృత్యరూపము చాలా ఆసక్తికరమైనది. భరతనాట్య గ్రంథమున 108 రకాల నృత్యముల ప్రసక్తి వున్నది. దీనినిబట్టి ఇవన్నియు శివుడు చేసెనని చెప్పవచ్చును. కానీ శివుని నృత్య రూపాల నన్నింటిని ఖచ్చితముగా తెలుపుట కష్టము.

తారక వనమందలి ఋషుల గర్వాన్ని శివుడు అణచిన రీతినుండియే శివనృత్యము ఉద్భవించినదని పురాణములు తెలుపుచున్నవి. ఈ ఋషులు తపస్సులు చేసి తమ ఘనతకు గర్వపడుచుండిరి. కానీ వారి సతులు దానిని నిరసించుచుండిరి కడకు వారు దేవతాశక్తులనే నిరసించుచుండుటచే శివవిష్ణువులు వీరి చర్యలను అణచవలచిరి. విష్ణువు అందగత్తెయైన మోహిని అవతారమును ధరించగా శివుడు అందమైన నిరంబర యువకుడుగా భిక్షాటనమూర్తి రూపమున సతిని తరుముచున్నట్లు నటించుచుండగా విష్ణువు దూరముగా పారిపోయెను. అందమైన స్త్రీరూప విష్ణువును చూసిన ఋషులు తమ తపోకృషినంతటిని మరచి మోహినిపై దృష్టి కేంద్రీకరించిరి. వారి భార్యలుకూడా ఆ కన్యను పట్టుకొనిరి. శివుడు కడకు ఆ కన్యను తీసుకొని వెళ్ళెను. కాని వీరు తమ హృదయములను కోల్పోయిరి. కన్య విషయమున కల్పించుకొనుటకు కోపోద్రిక్తులై ఋషులందరు ఒక క్రతువును చేసి ఒక సర్పమును, పులిని, నాశము చేసెడి అగ్నిని, ఒక మమూలకుడనెడి రాక్షసుని సృష్టించిరి. వీరినందరినీ శివుడు నాశనముచేసి, సర్పాన్ని తన ఆభరణముగా, పులిచర్మాన్ని తన వస్త్రముగా, అగ్నిని తన ఆయుధముగా చేసుకొని మమూలకుని దేహముపై నృత్యము చేసెను. ఇది ఒక పురాణగాథ. ఈ శివరూపమునే "నటరాజు" - నృత్యకారులకు రాజు అందురు.

"In brief the essential significance of Siva's dance is threefold.

Firstly, it is the image of His rhythmic activity as the source of all movement within the cosmos which is represented by the encircling arch or Prabhavali.

Secondly, the purpose of His dance is to release the countless souls of men from the snare of illusion — Maya.

Thirdly, the place of His dance - Chidambaram, the centre of the universe is within everyone's heart.

In brief the dance that Siva makes is believed to symbolise the action of cosmic energy in creating, preserving and destroying the visible universe."

శివుని నటరాజ రూప దేవాలయాలలో చిదంబరమందలి దేవాలయము ముఖ్యమైనది ఇచటనే కనకసభ యనెడి కేంద్ర దేవగృహమందు నటరాజు శివకామసుందరి రూపమున వున్న తన సతియైన పార్వతితోపాటు వున్నాడు. శివుడు నటరాజు రూపమున అన్నిరకాలలోను స్థానక రూపమున చూడబడియుండును నటరాజు రకాలలో ఆనందతాండవ (మమూలక రాక్షసుని దేహముపై నృత్యము చేయుట), సంధ్య తాండవ (రాక్షసుడు లేకుండా ఉన్న నృత్యము). ఉమాతాండవ (ఎడమవైపున ఉమ నిలుచొనియున్న నృత్యము). గౌరీతాండవ (కుడివైపు నందికేశ్వరుడు, ఎడమ ఉమ యుండగా నృత్యరూపము). కలికతాండవ (2 కండ్లు, 8 చేతులు కలిగి త్రిశూలము, noose, kettledrum, కపాలము, నిప్పు (fire, bell), అభయ, వరద పోజులుండుట), త్రిపురతాండవ (16 చేతులు, ఆయుధములు కలిగి గౌరి, స్కంధ చెరొకవైపుండుట), సంహారతాండవ (8 చేతులు కలిగి పుర్రెల హారము గలిగి ఉగ్రరూపము గలిగియుండుట). లలితతాండవ (4 లేక 8 చేతులు గలిగి పీఠముపై కాళ్ళుగలిగి కొంత లోనికి వంగియుండుము). ఊర్ధ్వతాండవ (కుడికాలు తలవరకు పైకెత్తి, ఎడమకాలు అపస్మారునిపై వుంచి 16 చేతులు కలిగి ఆయుధాలనేకము గలిగి మధుర, రామనాథపురం, తిరుణల్వేలిలోని స్తంభాలు పైగల పాండ్యకాల శిల్పాలవలె యుండుము) ములు గలవు.

ఆగమములుకూడా 108 శివనృత్యాలగూర్చి తెలుపుచున్నవి. భరతనాట్యమందలి అనేక నృత్యరీతుల అర్ధశిల్పాలు చిదంబరమందలి నటరాజ దేవాలయ తూర్పు ప్రవేశద్వారమువద్ద చెక్కబడియున్నవి.

మహేశ :

మహేశ శిల్పసార గ్రంథము ప్రకారము శివుని రూపాలు 16. కారణాగమ ప్రకారము 25. శివుని రూపాలన్నింటిని శాంత, అనుగ్రహ, సంహార, ఉగ్ర, నృత్య మూర్తులుగా ఐదు విభాగాలు చేయవచ్చును. శివుడు లేక మహేశ్వరుడు మానవాకారంలో స్థానక లేక ఆసనరీతిలో నాలుగు చేతులు కలిగియున్నట్లు చూపబడును. పై చేతులలో ఢంక, మఋలను కలిగి క్రిందివి అభయ, వరద ముద్రలలో వుండును. జటామకుటమున శిరోజాలు, వాటి ఎడమభాగాన అర్ధచంద్రుడు, కుడిభాగాన గంగాదేవి, సర్పము, ఆర్క పురుషులను కలిగియుండును. త్రినేత్రములు కలిగియుండును. పీతాంబరములనుగాని, జింకచర్మముగాని, పులిచర్మముగాని మోకాళ్ళవరకు ధరించియుండును. అతికొద్ది ఆభరణములను కలిగియుండును. సాధారణముగా శరీరమునకు, చేతులకు సర్పము చుట్టుకొనియుండును. ఎడమ చెవికి స్త్రీ ఆభరణమైన లంబపాత్రను, కుడి చెవికి పురుష ఆభరణమైన మకర కుండలాలను కలిగియుండును. కొన్ని సందర్భాలలో శివుడు అనేక శిరస్సులను, నాల్గుకన్న ఎక్కువ హస్తములను కలిగియుండును. మహా సదా శివుడు సుమారు 50 శిరస్సులను కలిగియుండగా ఊర్ధ్వనృత్యమూర్తి నాలుగుకన్న ఎక్కువ హస్తములను కలిగి యున్నాడు. ఊర్ధ్వనృత్యమూర్తి సుమారు 16 చేతులను కలిగి అనేక ఆయుధములను ధరించియుండును. ఇట్టి ప్రతిమలు మధుర, రామనాథ్, తిన్నవెల్లి జిల్లాలలోని పాండ్యుల దేవాలయ స్తంభములపై అగుపడును కాని నెల్లూరు జిల్లా మల్లాంలోని సుబ్రమణ్యేశ్వర దేవాలయమందలి మహా సదాశివుడు 5 శిరస్సులు, 16 చేతులు కలిగి అందు వివిధ అయుధములను ధరించియున్నాడు. బొంబాయికి 6 మైళ్ళ దూరంలోని ఎలిఫెంటా దీ-లోని క్రీ. శ 7వ శతాబ్దమునకు చెందిన రాష్ట్రకూట కాలమునాటి గుహాలయమున ముదురు బ్రౌన్ శిల (sand stone) యందు ముఖ్య దేవగృహానికి ఎదురుగా (దక్షిణ కుడ్యమున చెక్కబడిన) పెద్ద 18 అ॥ గల మూడు శిరస్సుల శివమహేశమూర్తి అర్ధ శిల్పము కలదు. ఇచటి శివమహేశమూర్తి ఎడమవైపు శిరస్సు భైరవ రూపమును, కుడివైపు శిరస్సు వామదేవ రూపమును, మధ్య శిరస్సు తత్పురుష శివరూపము కలిగియున్నాడు. భైరవ రూపము ఉగ్ర వినాశ శివ అవతారము. ఇందు శివుడు క్రూర మీస మూతి (cruel moustached mouth), కొక్కెపు ముక్కు (hooked nose), అలంకార శిరోవస్త్రము, సర్పము (ornamented head dress with cobra and deaths head) లను కలిగియున్నాడు వామదేవరూపము శివుని విశ్వసృష్టి అవతార చిహ్నము. This is an aspect (Siva) of creation with feminine features and blissful softness which is enhanced by the pearls and flowers in the hair and the lotus bud in the hand. తత్పురుష రూపము విరాగి జీవనమునకు చిహ్నము.

భైరవకోనయందు కూడా మహేశ అర్ధశిల్పము 4వ గుహాలయ గర్భగృహలోని శివలింగము వెనుకగల కుడ్య ముఖభాగమున చెక్కబడియున్నది (24వ చిత్రపటము చూడుము). ఇది ఎలిఫెంటా యందలి మహేశుని దాదాపు పూర్తిగా పోలియున్నది (24, 25వ చిత్రపటములు చూడుము) ఎడమవైపు శిరస్సు భైరవరూపమును, కుడివైపు శిరస్సు వామదేవ రూపమును, మధ్యశిరస్సు తత్పురుష రూపమును కలిగి, ఎలిఫెంటా మహేశుని వివరాలనే కలిగియున్నాడు

బ్రహ్మ :

బ్రహ్మ అవతారమునకు సంబంధించి పురాణాలు భిన్న అభిప్రాయాలను వెలిబుచ్చుచున్నవి. హిరణ్యగర్భ అను బంగారు గుడ్డునుండి ఉద్భవించాడనియు, విష్ణు నాభినుండి పుట్టిన తామరపుష్పమునుండి ఉద్భవించాడనియు

చెప్పబడుచున్నవి. బ్రహ్మకు ఆలయాలు నిర్మింపబడియుండుట అరుదుగా అగుపడును. బ్రహ్మకు పూజలు ఉండ రాదని మోహినిచే శపించబడుటే ఇందుకు కారణము. ఈ విషయము బ్రహ్మవైవర్త పురాణంలో చెప్పబడియున్నది. ఐననూ బ్రహ్మ ఆలయాలు కుంభకోణం, చిదంబరం, తిరువాడి, పుష్కర్‌వంటి ప్రాంతాలలో నిర్మింపబడియున్నాయి. బ్రహ్మ సాధారణంగా ఆలయాల స్తంభాలపై చెక్కబడియుండును. శివాలయాల ముఖ్య దేవగృహ ద్వారమునకు ఉత్తరవైపున గల కుడ్యభాగమున రూపొందింపబడి యుండును. శివుడు త్రిపుర అను రాక్షసుని వధించుటకు పోవు నపుడు అతని రథచోదకుడుగా యున్నట్లు శివాలయాల రథాలలో బ్రహ్మ (కొయ్యతో) చెక్కబడియుండును. విష్ణు నాభినుండి పుట్టిన తామరపుష్పమునుండి ఉద్భవించినట్లు వైష్ణవాలయాలలో బ్రహ్మ చూపబడియుండును. బ్రహ్మ (శిల్పమందు) స్థానక లేక ఆసీన రూపాలలో చతుర్ముఖుడై యుండవలెనని రూపమండన అనెడి గ్రంథమునందు తెలుపబడియున్నది. చతుర్ముఖము చతుర్వేదాలకు, నాల్గుదిక్కులకు చిహ్నమని అభిప్రాయము గలదు. తొలుత బ్రహ్మ పంచముఖుడనియు, శివుడు కోపముతో ఒక శిరస్సును ఖండించివేయుటచే నాల్గుశిరస్సులే మిగిలినవని తెలియు చున్నది. బ్రహ్మ చతుర్భుజుడు. ఇతడు సాధారణంగా కమండలము, అక్షమాల, స్రువ, స్రిక్, అజ్యస్థలి, పుస్తకము, కుర్చలను తన రెండు పైచేతులలో ధరించియుండును. క్రిందివైపు కుడి, ఎడమ హస్తాలు సాధారణంగా అభయ, వరద ముద్రలలో యుండును. బ్రహ్మ ఎరుపుగా యుండునని విష్ణుపురాణము, సుప్రభేదాగమము తెలుపుచున్నవి. కాని శిల్పరత్న గ్రంథము బ్రహ్మ తెల్లగా యుండునని తెలుపుచున్నది కొన్ని సందర్భాలలో ఈయన గడ్డము, మీసాలను కలిగి శిరోజాలు జటామకుటముగా కలిగియుండును. ఈయన మకరకుండల, ఉదరబంధ, కడియాలు మొదలగు ఆభరణాలను ధరించియుండును. కొన్ని సమయాలలో ఈయన సరస్వతి లేక ఇరువైపులా సరస్వతి, సావిత్రి దేవీలను కలిగి ఏడు హంసలచే లాగబడుచున్న రథమందు పయనించుచున్నట్లు చూపబడియుండును.

కుంభకోణం, తిరువాడి, చిదంబరం, కండియూర్, మామల్లపురం, తిరువొత్తియూర్ లందు అద్భుతమైన బ్రహ్మ శిల్పాలు గలవు. కుంభకోణం దగ్గరలోని స్థానక బ్రహ్మ శిల్పములు గలవు.

భైరవకోనయందలి గుహాలయాల ముఖ్య దేవగృహ ద్వారాల ఉత్తరవైపు కుడ్యభాగాలలో కూడా స్థానక బ్రహ్మ శిల్పము రూపొందించబడియున్నది (26వ చిత్రపటము చూడుము). ఇది కొంతవరకు కుంభకోణం బ్రహ్మ శిల్పమును పోలియున్నది. భైరవకోనలోని బ్రహ్మ నాల్గు హస్తములను, మూడు శిరస్సులను కలిగి స్థానకరూపమున యున్నాడు. కుడివైపు ముందు గల హస్తము అభయముద్రలో యున్నది. వెనుకహస్తమందు పుస్తకము కలదు. ఎడమవైపు ముందు గల హస్తము వరదముద్రలో యున్నది. వెనుకహస్తమందు ఆజ్యస్థలి (ghea pot) యున్నది. ఇతడు మకరకుండలము, ఉదరబంధము, చేతికడియాలు మొదలగు ఆభరణాలు ధరించియున్నాడు. జటామకుటములో ఇతని శిరోజాలు గలవు.

విష్ణు :

హిందూ మతమందు విష్ణువు ఒక ముఖ్య దైవము. వేదకాలమునుండి ఇతని ఆరాధన యున్నది. వేద కాలమున ఇతనిని సూర్యుడుగా కూడా భావించుట జరిగినది. ఋగ్వేదమున ఇతనిని రక్షకుడుగా, ప్రాచీనుడుగా కూడా ఆరాధించుట జరిగినది. ఇతిహాస పురాణకాలాలలో ఇతడు మరింత ప్రముఖ దేవుడుగా ఆరాధింపబడెను. ఆగమ గ్రంథాలు ఇతని అనేక రూపాలనుగూర్చి వివరించుచున్నవి. వాటిలో వైఖానస ఆగమము, పంచరాత్రాగమము, మాధవా చార్యుని తంత్రసారము, విష్ణుధర్మోత్తరము ముఖ్యమైనవి.

సాధారణంగా విష్ణువు చతుర్భుజాలు గలిగి వెనుక గల రెండు హస్తాలలో శంఖు, చక్రాలను ధరించి, ముందు గల రెండు హస్తాలు అభయ. వరద ముద్రలలోను లేక కుడివైపు హస్తము అభయ (లేక వరద) ముద్రలోను, ఎడమవైపు హస్తము గద లేక పద్మమును కలిగియుండును. ఇతడు కిరీటమకుట, మకరకుండల, హార, కేయూర, కంకణ, ఉదరబంధ, కటిబంధ, యజ్ఞోపవీత మొదలగు ఆభరణాలను ధరించియుండును. కుడి వక్షస్థల భాగాన శ్రీవత్స అనెడి మచ్చ కలిగియుండును. దీని సమీపాన శ్రీలక్ష్మిని కలిగియుండును. అంతేగాక వైజయంతి మాలను, కౌస్తుభమణిని కూడా ధరించియుండును. సాధారణంగా ఇతని దేవీలయిన శ్రీలక్ష్మి, భూదేవి లేక పృథ్వి కూడ ఇతనితోబాటు యున్నట్లు చూపబడును. మరికొన్ని సందర్భాలలో నీలదేవికూడ చూపబడును.

విష్ణువు స్థానక, ఆసన, శయన రూపాలలో యోగ, భోగ, వీర, అభిచారిక అనెడి 12 రకాలలో లేక ద్వాదశ మూర్తులుగా రూపొందింపబడియుండును. స్థానక రూపమందే విష్ణువు ఎక్కువగా చూపబడును. ఆసన రూపములో చూపబడినపుడు విష్ణువు ఆదిశేషునిపై ఆసీనుడై వున్నట్లు సాధారణముగా చూపబడును. ఆదిశేషుడు లేకుండా కేవలం ఆసనమూర్తి రూపంలో అతి అరుదుగా అగుపడును. శయనరూప విష్ణువు ఆదిశేషునిపై కుడి వైపుకు వాలినట్లు శయనించి శిరస్సు కొద్దిగా దక్షిణముగా కలిగియుండును. కాని మామల్లపురం వంటి చోట్ల స్థలశయనస్వామి పేరుతో నేలపైననే పరుండినట్లు చూపబడియుండుట కూడ కలదు.

ఇక విష్ణు అవతారాలగూర్చి పరిశీలించినచో, ఇతడు ముఖ్యంగా దశావతారములు కలిగియున్నట్లు తెలియుచున్నది. ఇతని అవతారాలగూర్చి పురాణాలు విపులంగా వివరించుచున్నవి. కొన్ని దశావతారాలగూర్చి తెలుపగా, భగవత్ పురాణము వంటి గ్రంథాలు విష్ణు అవతారాలు ఇరువదిరెండుగా తెలుపుచున్నవి. మరికొన్ని పురాణాలు మరి రెండింటిని చేర్చి మొత్తం ఇరువదినాల్గు అవతారాలుగా తెలుపుచున్నవి. అవి : మత్స్య, కూర్మ, వరాహ, నరసింహ, వామన (త్రివిక్రమ), పరశురామ, రామచంద్ర (రఘురామ), క్రిష్ణ, బలరామ (లేక బుద్ధ), కల్కిపురుష, నారద, నారాయణ, కపిల, దత్తాత్రేయ, యాజ్ఞ, రిషభ, ప్రిథు, వేదవ్యాస, ధన్వంత్రి, మోహిని, హయగ్రీవ అవతారాలు. ఈ అవతారాలలో విష్ణువు స్థానక రూపములో వుండి సాధారణంగా శంఖు (పాంచజన్యము), చక్రము (సుదర్శనము), పద్మము, గద (కౌమోదిక)లు కలిగియుండును. నందకం (sword), సారంగ (bow), బాణ (arrow), ఖేటక (shield) ములను కూడ కొన్నింటిలో ధరించియుండును. కాని విష్ణు సహస్రనామ గ్రంథమున వేయి అవతారాలగూర్చి తెలుపబడియున్నది. చెంగల్‌పట్టు జిల్లాలో పలియశీవరం నందలి దేవాలయంలోను, తిరువేంద్రమందును మనము ద్వాదశ అవతారాల శిల్పాలను చూడవచ్చును.

భైరవకోనయందలి విష్ణు శిల్పము స్థానక రూపంలో గుహాలయాల ముఖద్వారమునకు కుడివైపు గల కుడ్యభాగమున చెక్కబడియున్నది (27, 28 వ చిత్రపటములు చూడుము). ఇది కొంతవరకు సుందర పెరుమాళ్ కోయిల్ నందలి స్థానక విష్ణుమూర్తి శిల్పమువలె వున్నది. భైరవకోన విష్ణువు చతుర్భుజములను కలిగివున్నాడు. కుడివైపున ఉన్న ముందుకు గల హస్తము అభయముద్రలో వున్నది. వెనుక హస్తమున చక్రము గలదు. ఎడమ వైపు గల ముందు హస్తము వరదముద్రలో నున్నది. వెనుక ఉన్న హస్తమున శంఖు గలదు. ఈయన కిరీట మకుటము, మకరకుండలము, ఉదరబంధము, కటిబంధము, యజ్ఞోపవీతములను కలిగియున్నాడు ఈయనకు ప్రభామండలము గలదు.

*గణేశ :*

గణేశ్వరుడు శుభసూచనా నిలయుడుగాను, కోరిన వరములు తీర్చువాడుగాను భావింపబడుటచే భైరవకోన యందు ప్రాంగణమునందలి దేవకోష్ఠములలో ప్రతిష్ఠింపబడుటేగాక దాదాపు అన్ని దేవాలయాలలోను మనము గమనింపవచ్చును.

గణేశ లేక గణపతి హిందూమతమున ఒక ప్రముఖ దైవము ఇతనికే విఘ్నేశ్వరుడని పేరు. సాధారణ ముగా ప్రతి కార్యమునకు ప్రారంభమున ఇతనిని కొలుతురు. మలబారు ప్రాంతమందలి బ్రాహ్మణులలో ఒక తెగవారిని గణపతీయులని పిలుతురు. వీరు ఇతర దేవతలకన్నా గణపతినే ముఖ్యముగా కొలుతురు. విశ్వజ్ఞాన నిలయునిగా ఈ దేవుని హవెల్ భావించినాడు.

లింగపురాణమందు ఈ దేవుని పుట్టుక గూర్చి తెలుపబడియున్నది. ఒకానొకసారి అసురులు దేవతలను ఓడించిరి. దేవతలు శివునికి మొరపెట్టుకొనగా పరమేశ్వరుడు ఒక అసురుని సృష్టించి ఆతనికి విఘ్నేశ్వరుడని పేరిడెను ఇతడు శివుని భూతగణాలకు నాయకుడయ్యెను. కాని శివపురాణమందు పార్వతీదేవి ఒక బాలుని సృష్టించి తన స్నానగది వద్ద కాపలా ఉంచెనని, శివుడు లోనికి ప్రవేశించుటకు ప్రయత్నించగా ఆ బాలుడు ప్రతిఘటించెనని, అందుచే శివుడు కోపోద్రిక్తుడై ఆతని శిరము ఖండించి వేసెనని, ఆ తరువాత పార్వతిచే ఆ బాలుడు సృష్టింపబడిన వాడని తెలుసుకొని దేవతలందరిని ఉత్తర దిశగా పయనించి వారు మొదట చూసిన ప్రాణి శిరస్సును తెచ్చి ఆ బాలుని మొండెమునకు అతికించవలెనని ఆజ్ఞాపించినాడని, దాని ఫలితముగనే విఘ్నేశ్వరుడు మనము చూచెడి రూపము కలిగి యున్నాడని తెలుపబడియున్నది. అంతేగాక విఘ్నేశ్వరుని విధినిర్వహణకు ఎంతో సంతోషించి శివుడు విఘ్నేశ్వరుని తన భూతగణ నాయకునిగా చేసుకొనెను. ఇది శివపురాణమందలి వివరము.

ముద్గల పురాణమున గణపతియొక్క 32 రూపములగూర్చి తెలుపబడియున్నది. శిల్పసార గ్రంథమున కూడా వీటిని కొన్నింటిని ప్రస్తావించబడియున్నది సాధారణముగా గణపతి కూర్చొని లేక నిలుచొనినట్లు రూపొం దింపబడి సమభంగ లేక అవిభంగ రీతిలో యుండును. గజశిరస్సు కలిగి తొండము ఎడమవైపుకు తిరిగియుండును. కొన్ని సందర్భాలలో కుడివైపుకు తొండముండును. ఇటువంటి సందర్భాలలో గణపతిని వలంబూరి వినాయక అందురు. సాధారణముగా ఇతడు రెండు నేత్రములనే కలిగియుండును. కాని ఆగమములు కొన్ని సందర్భాలలో మూడు నేత్రములుండవలెనని తెలిపియున్నవి. ఇతడు సామాన్యముగా నాలుగు చేతులను కలిగియుండును కాని 16 చేతులు కూడా కలిగి వాటిలో ఆయుధములను కలిగియుండుట కూడా కలదు. చేతిలో ఇతని ఆయుధాలలో పాశ, అంకుశములే గాక మోదక, ఆహార బంతి కూడా యుండును. పెద్ద ఉదరము కలిగి దానికి సర్పము చుట్టుకొని యుండుటచే ఇతనికి లంబోదరుడని పేరు కూడా కలదు. చిన్న ఎలుక వాహనము కలిగియుండును. ఇది పీఠము దగ్గరలో యుండును.

ఏకరూప గణపతి కూర్చొనిగాని, నిలుచొనిగాని యుండుటేగాక అనేక రకాలలో యుండును. తమిళులు గణపతిని పిళ్ళయ్యార్ లేక వినాయకర్ అందురు. ప్రతిచోట దేవాలయాలలో మనకగుపడును. గణపతి శుభసూచక ముగను, వరములిచ్చువాడుగను భావింపబడుటచే ప్రతి గ్రామ మారుమూలలందును ప్రతిష్ఠింపబడియుండును.

ప్రసిద్ధిగాంచిన గణపతి దేవాలయాలలో తిరుచినాపల్లిలోని ఉచ్చిపిళ్ళయ్యార్ కోయిల్, నన్నిలం దగ్గరలోని తిరుచ్చెన్ గట్టిన్ గుడి ముఖ్యమైనవి. తిరుచ్చెన్‌గట్టన్ గుడిలో గణపతి మానవ శిరస్సు కలిగియున్నాడు. భైరవ

కోన గుహల ప్రాంగణాలలో కూడ గణపతి కలడు (17, 21వ చిత్రపటములు చూడుము). ఇచటి గణపతి ఆసీన రూపములో వున్నాడు. పాశ, అంకుశ, ఆహారబంతి, మోదకములను నాల్గు హస్తాలలో కలిగి పెద్ద ఉదరము కలిగి యున్నాడు.

*చండేశ :*

చండేశ లేక చండికేశ్వరుడు శివుని పరివార దేవతలలో ఒకడు (29, 30వ చిత్రపటములు చూడుము). సాధారణముగా ఇతడు స్థానక లేక ఆసీన రూపములో రెండు హస్తములు కలవాడుగాను, ఆ హస్తములం దొకదాని యందు 'టంక' లేక 'పరశు'ను కలిగి, రెండవ హస్తము ఆతని తొడపై వుండునట్లుగాను, కొన్ని సందర్భములలో తన భార్యయైన ధర్మనీతితో యుండునట్లు కూడ చూపబడుట గలదు. సామాన్యముగా శివ దేవాలయములందు నైవేద్యమును తొలుత చండికేశ్వరునికిచ్చి ఆ తరువాతనే శివునికిచ్చుట జరుగును. దీనికి శివుని ఆజ్ఞయే కారణమని, చండికేశ్వరుడు పొందిన వరమే కారణమని ఒక తథవము కలదు. అది ఏమనగా, శైనలూర్ అను వానికి పశువుల కాపరిగా యజ్ఞదత్తుడను వాడుండెను. యజ్ఞదత్తునికి విచారశర్మన్ అను కుమారుడుండెను. విచారశర్మ పశువులు మేపుటకై పంపబడెను. కానీ ఇతడు పశుగ్రాస ప్రాంతమందు చిన్నచిన్న శివలింగములను ఇసుకతో రూపొందించి కొన్ని గోవుల పాలు పితికి ఆ లింగములపై పోయుచుండెను. ఒకనాడు ఆతని తండ్రి ఇది గమనించి కోపముతో ఆ లింగరూపములోని ఇసుకను తన్నుటకు ప్రయత్నించగా భక్తి పారవశ్యమున ఉన్న ఆతని పుత్రుడు కోపముతో తండ్రి కాళ్ళను గొడ్డలితో నరికివేసెను. ఇది గమనించి తన భక్తుని భక్తికి మెచ్చి శివుడు ప్రత్యక్షమై విచారశర్మను చండేశ్వర అను పేరుతో తన 'భూతగణము'లకు అధిపతిగా నియమించుకొని చండికేశ్వరునికి నైవేద్యము చేసిన తరువాతనే తనకు నైవేద్యము చేయవలెనని శివుడు ఆజ్ఞాపించెను. పార్వతీ సమేతుడుగా సోమ-స్కంద రూపుడైన శివుడు చండికేశ్వరుని శిరస్సును స్పృశించుచు పుష్పమాలను అలంకరించు రూపములోని ఒక శిల్పరూపమును మనము తంజావూరు జిల్లానందలి గంగైకొండ చోళపుర దేవాలయమందు గమనించవచ్చును. భైరవకోన గుహల ప్రాంగణాలలో కూడ చండికేశ్వరుడు గలడు (29, 30 వ చిత్రపటములు చూడుము). ఇచటి చండీశుడు ఆసనరూపమున వున్నాడు. రెండు చేతులు గలవు. కుడిచేతిలో పరశు గలదు. ఎడమచేయి ఎడమతొడపై ఆన్చియున్నాడు. గుబురైన శిరోజాలను కలిగియున్నాడు. లావుపాటి మూడు వరుసలుగల యజ్ఞోపవీతమును ధరించియున్నాడు. సంహార రూపమున వున్నాడు ఎడమకాలు పద్మాసనములో ముడుచుకొని కూర్చొనియున్నాడు. కుడికాలు పైకెత్తి ముడుచుకొని పాదమును భూమిపై ఉంచియున్నాడు. కర్ణకుండలములను ధరించి, మెడలో దండను కలిగియున్నాడు. ఇచటి చండీశ శిల్పాలలో కొన్ని కొంత పరిపక్వ శిల్ప లోపమును కలిగియున్నవి. మరికొన్ని నైపుణ్యమైన శిల్పులచే రూపొందింపబడినట్లు తెలియుచున్నది.

చండీశ ఆరాధన శైవ సిద్ధాంతమున ఒక ప్రత్యేకస్థానమును కలిగియున్నది. ఒక మానవమాత్రుడు దైవత్వ స్థానమును పొందుట ఇందు మరువరాని అంశము, అరువది ముగ్గురు నాయన్మారులుగా గుర్తింపబడి యున్నప్పటికి చోళరాజ్యమందలి చేయింజలూర్‌కు చెందిన యజ్ఞదత్త, భద్ర అను దంపతులకు జన్మించిన విచారశర్మ యను బాలుడు మాత్రమే శైవ దేవగృహాలకు ముఖ్య అధిపతిగా శివునిచే నియమింపబడెను.

శివభక్తుడైన విచారశర్మ శివపూజకై ఉంచుకొన్న పాలపాత్రను తన తండ్రి తన్నినందుకు కోపముతో శివునికి అపచారము జరిగినదని తండ్రి కాళ్ళనే నరికివేయుటకు సిద్ధమగుట, ఇట్టి తరుణమున శివుడే ప్రత్యక్షమై ఆతని తండ్రికి కాళ్ళు వచ్చునట్లు చేసి, విచారశర్మను తన పుత్రునిగా దత్తత చేసుకొనెడి విషయము పురాణమున చెప్పబడి

యున్నది. అంతేగాక అతనికి చండీశ అను బిరుదునిచ్చి తనతో సమానముగా అన్నిరకముల నైవేద్యములు ఇవ్వబడు నని వరమిచ్చెడి వివరముకూడా 'దేవరం' నందు చెప్పబడియున్నది. ఈ గ్రంథ ప్రాచీనత కూడా చండీశ ఆరాధనా ప్రాచీనతను తెలుపుచున్నది.

చండీశుని శిల్పము మనకు పల్లవ రాజైన రాజసింహుని కాలమునాటి కైలాసనాథ దేవాలయమున మొట్ట మొదట అగుపడును. కాలక్రమమున చండీశ ఆరాధన ప్రచారమును పొంది చండీశునికి ప్రత్యేక దేవగృహాలు ఆలయప్రాకారాలలో 'ప్రణల'కు ఎదురుగా నిర్మించుట జరిగెడిది. తంజావూరు నందలి రాజరాజేశ్వర (బృహదీశ్వర) దేవాలయమునందలి చండీశ దేవగృహము మాత్రమే ఒకటవ రాజరాజు కాలమునకు చెందినది. మిగిలినవన్నియు తరువాత కాలమునకు చెందినవి. రాజరాజు చండీశుని పేరుతోనే ఆ దేవాలయ ఆస్తులుకూడా వ్రాయించి ఆతడే ఆలయ ఆస్తుల రక్షకుడుగా కూడా భావించినాడు. ఈ ఆచారము క్రీ. శ. 1118 వ సంవత్సరమునాటి విక్రమచోళుని కాలము వరకు కొనసాగినట్లు తెలియుచున్నది. రాత్రిపూట ముఖ్యదేవుని పవళింపుసేవ కార్యక్రమము పూర్తయిన తరువాత ఆలయద్వారములు మూతవేసి తాళములు చండీశునివద్ద వుంచెడి ఆచారముకూడా వుండెడిది.

మొదటి రాజేంద్రుని కాలమున ఉత్తర భారతదేశముపై దండయాత్ర చేయబడి సాంస్కృతిక కలయిక ఏర్పడి నర్మదానదీ ప్రాంతమునుండి అనేకమంది శైవాచార్యులు దక్షిణదేశమునకు వచ్చిరి. దీనితో మరింత శైవ సాహిత్యము వృద్ధిచెందినది. క్రీ. శ. 1158 లో అఘోర శివాచార్యుడను గురవు 'క్రియాక్రమయోధిని' అను గ్రంథము రచించి అందు చండీశుని చతుర్ముఖ రూపముగూర్చి కూడా విశదీకరించినాడు. ఇతడు చండీశునికి ప్రత్యేక దేవ గృహాన్నికూడా నిర్మించవచ్చునని తెలిపినాడు.

చండీశ ఆరాధన గంగైకొండ చోళపుర ఆలయమున మనము గుర్తించవచ్చును. మధురయందు ఆరాధనా రీతిలో చండీశుడు శిల్పమందగుపడును. చంగల్పట్టు దగ్గరలోని తిరుకాచూరు నందలి చండీశుడు చతుర్ముఖుడు. లేపాక్షియందు విజయనగర కాలమునకు చెందిన చిత్రలేఖనాలలో కూడా చండీశ అనుగ్రహమూర్తి గలడు. కాని మద్రాసు. పూనమల్లె మధ్య గల పోరూర్‌నందలి చండీశ శిల్పము ఒక ప్రత్యేకమైనది ఇచటి రమణాదీశ్వర దేవాలయమున ఈ శిల్పము గలదు. ఇచటనే ఒకటవ రాజేంద్రుని 'మెయ్‌కీర్తి' గలదు. ఇది 'తిరుమన్ని వలర. ఇరు నీల మదంత్యం' అను పలుకులతో ప్రారంభమగుచున్నది. ఇచటి చండీశుడు ప్రత్యేకతను కలిగివున్నాడు. 'ఆసన' రీతిలో. 'మఝు'ని కుడిచేతిలో ధరించి గుబురైన శిరోజాలు కలిగి, లావుపాటి 'యజ్ఞోపవీత'మున ధరించి యున్నాడు'. ఇవన్నియు పల్లవరీతిని తెలుపుచున్నవి. 'కౌపీనము' సంహార రూపమున యున్నాడు.

*నందికేశ్వర :*

భైరవకోన గుహాలయాల ప్రాంగణ మధ్యభాగమున శివుని వాహనమైన నంది ప్రతిమ (11 నుండి 22 వ చిత్రపటములు చూడుము). ప్రాంగణ కుడి, ఎడమలందు కోష్ఠములలో చండేశ, గణేశ (11 నుండి 22, మరియు 29, 30 వ చిత్రపటములు చూడుము) అర్ధశిల్పములు మనకగుపడును. ప్రతి శివాలయ గర్భగృహలోని శివలింగము లేక శివునికెదురుగా కొంతదూరములో శివుని వాహనమైన నంది లేక నందికేశ్వర (లేక అధికార నంది) ప్రతిమ ప్రతిష్ఠించుట సాంప్రదాయము. కావున భైరవకోన ప్రాంగణమందు గర్భగృహలోని శివలింగమునకు ఎదురుగా నంది ప్రతిమ యున్నది. నందికేశ్వరునిగూర్చి భగవత్ పురాణము. రామాయణములందు ప్రస్తావించబడియున్నది. లింగపురాణ

మందు శైలద అనే గ్రుడ్డివాడైన మహర్షి పుత్రసంతానము కొరకు శివుని ప్రార్థించగా శివుడు తన భక్తునికొరకు నంది కేశ్వరుని సృష్టించినాడని తెలుపబడియున్నది.

*ద్వారపాలురు :*

ద్వారపాలురు ఆలయాల రక్షకభటులు. వైష్ణవాలయాల ముఖ్య దేవగృహాని కిరువైపులా జయ, విజయు లుందురు. వీరు స్థానక రూపాలతో నాలుగు చేతులు కలిగియుందురు. పై హస్తాలలో శంఖు, చక్రాలను, క్రింది హస్తాలలో ఒకటి గదను కలిగి, మరొకటి శుచి హస్తముద్రలో యుండును. శైవ ఆలయాల ముఖ్య దేవగృహాల ఇరువైపులా కూడ మరు, శూలములను ధరించిన నాలుగు హస్తాలు గల ద్వారపాలురుందురు. దేవీ ఆలయాలకు స్త్రీ ద్వారపాలురుండుట మనము గమనింపవచ్చును. ద్వారపాలురు సాధారణంగా శిల్పమందు కోపరూపులు కలవారుగా రూపొందింపబడియుందురు. కాని తిరుమల వంటి దేవాలయాలలో, ద్వారపాలురు రాగి లోహంతో రూపొందింప బడియున్నారు.

భైరవకోనయందు గుహాలయాల ద్వారమున కిరువైపులకూడా ద్వారపాలురు రూపొందింపబడియున్నారు (12 నుండి 22 వరకు, 26 నుండి 28 వ చిత్రపటములు చూడుము). మొదటి నాలుగు గుహలలో ఒక రకముగను, చివరి నాలుగు గుహలలో కొంత పరిణితి దశకు చెందిన శిల్పరూపములను కలిగియున్నట్లు ఇచటి ద్వారపాలురు యున్నారు. వీరు కొమ్ముల కిరీటమును కర్ణకుండలములను మెడలో పూనలదండను, కటిబంధమును, చేతులకు కడియాలను కలిగియున్నారు. కొన్ని గుహలవద్ద గల ద్వారపాలురు ఎడమచేతిలోని గదను కుడివైపుకు పెట్టి ఆ గదల పై వాలినట్లు నిలుచొనియున్నారు. మరికొన్ని గుహలవద్ద గల ద్వారపాలురు కుడిచేతిలోని గదను ఎడమవైపుకు పెట్టుకొని ఆ గదలపై వాలినట్లు నిలుచొనియున్నారు తొలిరకములో ఎడమకాలు నిలువుగాను, కుడికాలు వంచి ఎడమవైపుకు పెట్టుకొనియున్నారు. రెండవ రకమున కుడికాలు నిలువుగా వుంచి ఎడమకాలు వంచి కుడివైపుకు పెట్టుకొనియున్నారు. రెండింటిలో చేతులు కట్టుకొన్నట్లు యున్నారు.

*భైరవకోన గుహాలయాలపై అభిప్రాయాలు :*
*(Views on the Cave-Temples of Bhairavakona)*

While writing about the Bhairavakona cave temples K. R. Srinivasan observes: ".....On either bank of Krishna ... cave temples of Eastern Chalukyan authorship show individualistic characters in their lay-out, iconography and the scheme of the cella. They partake in some respects of the neighbouring Pallava modes, apart from their Parental Chalukyan and northern inheritance. The remarkable feature of this series of cave-temples is the occurance of a rock-cut pedestal socket at the base of the rear wall of the cella denoting the object of worship, whether it be the linga form of Siva, or a sculptured stele bearing the image of other God inserted into the socket. In Bhairavakonda the socket is cut in a sunken recess on the wall over the pedestal to take in the linga, or image..... the cave-temples of the Eastern Chalukyas ... practically all the cave-temples are Saiva, or are dedicated to other deities of the Saiva pantheon. The only exception is the aberrent Undavalli cave-temples which is dedicated to Vishnu. The Nandi in Saiva cave-temples is rock-cut as in the Pandyan examples farther south. In point of time the Akkanna-

Madanna... cave at Vijayawada in its present form comes first. It is ascribable to the middle of the seventh century, and is closely followed by caves I to iv of Mogalrajapuram, the lower cave-temple at Vijayawada, the Undavalli and other caves in a series (p. 81). .. ending with the Bhairavakonda group (are) datable to the middle of the eighth century. The lost, if not of direct Eastern Chalukyan vintage, can at best be of Telugu - Choda authorship...."

The... dancing Siva and Harihara... The eight cave-temples... Tne first four shrine excavations... and... The second group... having an outer mandapa with... pillars and... fully formed kopota with Kudus (are) as in the Mamall-style cave-temples... The pillars are... in... Chalukyan pattern as found in the cave-temples on the banks of Krishna...some...are...in the Mamalla-style... Shrineentrances are plain... These mixed characters and other features as also the presence of relief sculptures of Brahma and Vishnu in the Mandapa, provision for a linga in the shrine, and the presence of other sculptures like Chendesa and Ganesa, and the rock-cut Nandi, would indicate their non-Pallava origin and their date as being the middle of the eighth century.

S. K. Sarasvati observes: "... Pallava rulers... imbibed and carried on the traditions of the earlier Vengi school. Mahendravarman Pallava (C. A. D 600 - 630)... in the south... excavated many cave shrines which seem to represent an innovation... Mahendra proudly described his cave-temples as composed without bricks, mortar, metal or timber (anishtakem asudham alauham nirmapitam) in the Mandagapattu inscription." Again Sarasvati says: " The pallavas inherited the less severe repertory of elegant and attenuated forms of the later phase of Vengi style which lingered till the fourth century, and possibly even later. But .. the pallava sculptors could not ignore entirely the rock-cut idiom of the Deccan and the reliefs of Bhairavakonda, distinguished each by a heavy physiognomical form, bea the impress of the contemporary Deccanese tradition. The contribution of the Vengi school, however, principally determined the character of the Pallava style."





చిత్రపటం - 3: విజయవాడ వద్దగల అక్కన్న మాదన్న గుహాలయము




చిత్రపటం - 4: విజయవాడ వద్దగల అక్కన్న మాదన్న గుహాలయపు ప్లాను



చిత్రపటం - 5:  మొగల్‌రాజపురమందలి నాల్గవ గుహాలము




చిత్రపటం - 6:  మొగల్‌రాజపురమందలి నాల్గవ గుహాలయపు ప్లాను



చిత్రపటం - 7 : ఉండవల్లి వద్దగల ''అనంతశయనగుడి'' గుహాలయము.



చిత్రపటం - 8 : ఉండవల్లి వద్దగల ''అనంతశయనగుడి'' గ్రౌండ్ ఫ్లోర్ ప్లాను



చిత్రపటం - 9 : ఉండవల్లి వద్దగల "అనంతశయనగుడి" మొదటి అంతస్తు ప్లాను.




చిత్రపటం - 10 : ఉండవల్లి వద్దగల ఏకశిలాగుడి



చిత్రపటం - 11: భైరవకోన గుహాలయాలు. శిల్పాల దృశ్యము



చిత్రపటం - 12: భైరవకోన గుహాలయాలకు ఎదురుగా గల శిలాఖండముపై గల శిల్పాలు, భైరవాలయం



చిత్రపటం - 13 : భైరవకోనలోని ఒకటవ గుహాలయం



చిత్రపటం - 14 : భైరవకోనలోని ఒకటవ గుహాలయం (కుడివైపుది)
రెండవ గుహాలయం (ఎడమవైపు పైది)



చిత్రపటం - 15: భైరవకోనలోని రెండవ గుహాలయం (మధ్య పైది).



చిత్రపటం - 16 : భైరవకోనలోని ఒకటవ గుహాలయం (కుడివైపు కొసది). రెండవ గుహాలయం (మధ్య పైది). మూడవ గుహాలయం (ఎడమవైపు క్రింది కొసది).



చిత్రపటం - 17: భైరవకోనలోని నాల్గవ గుహాలయం (కుడివైపు క్రిందిది). ఐదవ గుహాలయం (కుడివైపు పైది
ఆరవ గుహాలయం (ఎడమవైపు క్రిందిది). ఏడవ గుహాలయం (ఎడమవైపు పైది).



చిత్రపటం - 18: భైరవకోనలోని నాల్గవ గుహాలయం (మధ్య క్రిందిది).
ఐదవ గుహాలయం (మధ్య పైది). ఆరవ గుహాలయం (ఎడమవైపు కొసది).



చిత్రపటం - 19 : భైరవకోనలోని
నాల్గవ గుహాలయం (క్రిందిది), ఐదవ గుహాలయం (పైది).



చిత్రపటం - 20 ; భైరవకోనలోని ఆరవ గుహాలయం,
ఏడవ గుహాలయం (ఎడమవైపు పైది).



చిత్రపటం - 21 : భైరవకోనలోని నాల్గవ గుహాలయం (కుడివైపు క్రిందిది). ఐదవ గుహాలయం (కుడివైపు పైది). ఆరవ గుహాలయం (మధ్యది). ఏడవ, ఎనిమిదవ గుహాలయాలు (ఎడమవైపు పైవి).




చిత్రపటం - 22 : భైరవకోనలోని ఏడవ గుహాలయం



చిత్రపటం - 24: భైరవకోనలోని నాల్గవ గుహాలయం లోపలి వెనుక కుడ్య ముఖభాగాన యున్న మహేశ శిల్పము.



చిత్రపటం - 25: ఎలిఫెంటా గుహాలయాలలోని మహేశ (త్రిమూర్తి) రూపములోని శివుడు.



చిత్రపటం - 28: భైరవకోన గుహాలయాల ప్రవేశమార్గమునకు ఎడమవైపు గల వెలుపలి కుడ్యముపై గల బ్రహ్మ, ద్వారపాలుర శిల్పాలు.



చిత్రపటం - 27: భైరవకోన గుహాలయాల ప్రవేశమార్గమునకు కుడివైపు గల వెలుపలి కుడ్యముపై గల ద్వారపాలుడు. విష్ణువుల శిల్పాలు.



చిత్రపటం - 28: భైరవకోన గుహాలయాల ప్రవేశమార్గమునకు కుడివైపు గల వెలుపలి కుడ్యముపై గల మరొక ద్వారపాలుడు. విష్ణువుల శిల్పాలు.



చిత్రపటం - 29 : భైరవకోనలోని చండికేశ్వరుని శిల్పము



చిత్రపటం - 30 : భైరవకోనలోని మరొక చండికేశ్వరుని శిల్పము



చిత్రపటం - 31 : భైరవకోనలోని నాల్గవ గుహాలయపు మండపమందలి స్తంభము పైభాగ రూపము.



చిత్రపటం - 32 : భైరవకోన గుహాలయాలకు ఎదురుగా గల పెద్ద శిలాఖండముపైన యున్న భైరవుని కట్టడ ఆలయము.



చిత్రపటం - 33 : భైరవకోనలోని
ఒకటినుండి నాల్గవ గుహాలయాల
రఫ్ గ్రౌండ్ ప్లాను



చిత్రపటం - 34 : భైరవకోనలోని
ఐదునుండి ఎనిమిదవ గుహాలయాల
రఫ్ గ్రౌండ్ ప్లాను




చిత్రపటం - 35: భైరవకోనలోని నాల్గవ గుహాలయం ప్లాను




చిత్రపటం - 36: భైరవకోనలోని ఏడవ గుహాలయం ప్లాను

# ఆధార గ్రంథాలు

## REFERENCES


1. A. Butterworth & Venugopal Chetty, *A collection of Inscriptions on Copper plates and stones in Nellore District,* Madras, 1905.
2. Cf. A. H. Longhurst, *Pallava Architecture, Memoirs of the Archaeological Survey of India,* No. 17, Simla, No. 33 & 40.
3. K. V. Soundara Rajan, *Architecture of the Early Hindu Temples of Andhra Pradesh,* Andhra Pradesh Government Archaeology Series No. 21, Hyderabad, 1965.
4. *Journal of the Andhra Historical Research Society,* Hyderabad, 1985, Vol. XXXVIII, Part III.
5. *T. A. Gopinatha Rao, Elements of Hindu Iconography,* Varanasi, 1971.
6. H. K. Sastri, *South Indian Images of Gods and Goddesses,* Delhi, 1974.
7. K. V. Soundara Rajan, *The Art of South India, Tamilnadu & Kerala,* Delhi, 1978.
8. Shakti M. Gupta, *Legends Around Shiva,* Bombay, 1979.
9. Roy C. Caven, *A Concise History of Indian Art,* New york, 1976.
10. K. V. Soundara Rajan, *Invitation to Indian Architecture,* New Delhi, 1984.
11. V. Kameswara Rao, *Select Vijayanagara Temples of Rayalaseema,* Hyderabad' 1976, *The Lepakshi Temple,* Tirupati, 1982.
12. K. R. Sreenivasan, *Temples of South India,* Second edition, New Delhi, 1979.
13. T. N. Sreenivasan, *A Hand Book of South Indian Images,* Published by Tirumala Tirupati Devasthanams, Sacond edition, 1982.
14. Fergusson J. and Burgess J., *Cave Temples of India.*
15. Percy Brown, *Indian Architecture* (Hindu and Buddhist), Bombay. 1956.
16. C. Sivaramamurthy, *Early Eastern Chalukyan Sculpture.*
17. Dr. James Burgess, *A Guide to Ellora Temples,* Published by the Department of Archaeology & Museums, Andhra Pradesh, Hyderabad.
18. *Nellore District Gazetteer*
19. S. K. Sarasvati, *A Survey of Indian Sculpture,* Second revised edition, New Delhi, 1975.
20. P. Z. Pattabhiram, *Sancturies Rupestres De L' Inde Du Sud,* Pondicherry, 1971.
21. K. V. P. Soundararajan, *Architecture of the Early Hindu Temples of Andhra Pradesh,* Andhra Pradesh Government Archaeology Series No. 21, Hyderabad, 1965.
22. M. Rama Rao, **Select Temples of Andhradesa,** Hyderabad, 1965.
23. B. Rajendra Prasad, **Art and Architecture of Nellore District,** An article presented by the author at a seminar on History of Nellore District, held at Kavali in 1977.

24. **Annual Reports of Archaeological Survey of India,** Southern Circle, 1920-21 years, 1904-5, 1906-7, 1916-17.

25. Jouveau - Dubreuil, **Dravidian Architecture.**

26. D. Subramanyam Reddy, (author of the present book). **The Sculptural Wealth, at Mallam**, Nellore, 1984.

27 డి. సుబ్రమణ్యంరెడ్డి. *భైరవకోన గుహాలయాలు* (వ్యాసం). తెలుగు: త్రైమాసిక విజ్ఞాన పత్రికలో తెలుగు అకాడమీ ప్రచురణ, ఏప్రిల్-జూన్, 1985, సంచిక 2, సంపుటి 14.

28. వై. గోపాలరెడ్డి. **అపూర్వమైన** *రామాయణ శిల్పము*. భారతి, సెప్టెంబర్, 1978.

29. ఆర్. సుబ్బారెడ్డి. *నెల్లూరు మండల చరిత్ర*. నల్లపురెడ్డి చంద్రశేఖరరెడ్డిచే సంపాదితము గావించబడిన శ్రీ విక్రమ సింహపురి మండల సర్వస్వము నందు. ద్వితీయ ఖండము, నెల్లూరు, 1963.

30 భైరవకోన - శ్రీనాధుని క్రీడాభిరామము. విక్రమ సింహపురి మండల సర్వస్వమందలి వ్యాసము. ద్వితీయ ఖండము.

31 శ్రీపాద గోపాలకృష్ణమూర్తి, *నెల్లూరు మండల దేవాలయాల శిల్పశోభలు*. శ్రీ విక్రమ సింహపురి మండల సర్వస్వము నందు, తృతీయ ఖండము.

32. మతుపూరు కోదండరామరెడ్డి, *నెల్లూరు మండలము: నిన్న, నేడు, రేపు.* నాగారెడ్డి హరిశ్చంద్రారెడ్డిచే సంపాదితము కాబడిన 'నెల్లూరు సహకార వ్యవసాయాభివృద్ధి బ్యాంకు: నాటి నుండి నేటి వరకు' : 1930-1977, Commomorative Volume నందు. నెల్లూరు, 1977.

33. కేతవరపు వేంకట రామకోటి శాస్త్రి. *తిక్కన - హరిహరనాథుడు*. శ్రీ విక్రమ సింహపురి మండల సర్వస్వమునందు, ద్వితీయ ఖండము.

34. రాయప్రోలు సుబ్రహ్మణ్యం. *నెల్లూరు మండలము - భైరవకొండ*. శ్రీ విక్రమ సింహపురి మండల సర్వస్వమందు. ద్వితీయ ఖండము.

35. దీపాల పిచ్చయ్య శాస్త్రి. *తిక్కన, భారత కృత్యావతారిక*. శ్రీ విక్రమ సింహపురి మండల సర్వస్వము నందు. ద్వితీయ ఖండము.

36. సిరిపురం చంద్రహాస్, *మతము - దేవాయతనములు*. నాగారెడ్డి హరిశ్చంద్రారెడ్డిచే సంపాదితము కాబడిన గ్రంథము

37. భైరవకోనయందలి శ్రీ దుర్గా భైరవ బ్రాహ్మణాన్న సత్రముచే 29-9-1984 లో ప్రచురితమైన కరపత్రము (ఆహ్వాన పత్రిక)

38. V. Narayanaswamy, **Pallava Chandisa near Madras,** article in Indian Express, English Daily, dated April 23 rd 1985.

